సంపాదకులు :

బాలాంత్రపు నళినీ కాంతరావు
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సహకారం :

పాలగుమ్మి విశ్వనాథం
బాలాంత్రపు రజనీకాంతరావు
కురుమెళ్ళ వేంకటరావు
కె.వి. రమణారెడ్డి
నిడమర్తి నిర్మలాదేవి
పి.బి. శ్రీనివాస్
వెలమకన్ని సుబ్రహ్మణ్య శర్మ
వింజమూరి ప్రభాకరం
అవసరాల అనసూయా గిరి
వింజమూరి సీతాదేవి
బి. గోపాలం
పి.ఎస్. గోపాలకృష్ణ

పర్యవేక్షణ :

పాలగుమ్మి పద్మరాజు
ఎ.ఎస్. రామన్

# కృష్ణశాస్త్రి

## వ్యాసావళి — 3

# మహావ్యక్తులు



ఓరియంట్ లాఙ్మన్

ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు
కామాని మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038
17 చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 700 072
160 అన్నాసలాయి, మద్రాసు 600 002
1/24 ఆసఫ్ ఆలీ రోడ్డు, కొత్తఢిల్లీ 110 002
80/1 మహాత్మాగాంధీ రోడ్డు, బెంగుళూరు 560 001
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029
బిర్లా మందిర్ రోడ్డు, పాట్నా 800 004
పాటియాలా హౌజ్, 16-ఎ, అశోక్ మార్గ్, లక్నో 226 001
ఎస్.సి గోస్వామి రోడ్డు, పాన్ బజార్, గౌహతి 781 001



**ISBN 0 86125 948 3**

ప్రచురణ
ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

టైప్ సెట్
మాస్టర్ గ్రాఫిక్స్, లక్డీకాపూల్, హైదరాబాద్ 500 004

ముద్రణ
కార్డుబాక్స్ కంపెనీ, నాంపల్లి స్టేషన్‌రోడ్, హైద్రాబాద్ 500 001

# విషయ క్రమం

"రామమోహన రాయలు అంటే 'విలియం బెంటింక్ సాయంతో సహగమనమును మాన్పించెను' అంటాం, దిక్కు మాలిన text book లో అంతే ఉంది. అది అప్పగించేస్తాం. ఆయన సమగ్ర భారతాభ్యున్నతికి ఏ విధంగా మూల పురుషుడో, ఆయన ఏలాగున నవ యుగానికి ప్రవక్తో, తొలి విశ్వమానవుడో (Universal man), ఆయన చూపించిన గమ్యస్థానాన్ని ఇంకా స్పష్టంగా దర్శించలేక, లోకం యావత్తూ అటు కదలి నడవడానికి గిలగిల లాడుతూ, కిందా మీదా పడుతూ ఎలాగ ప్రయత్నం చేస్తూందో తెలుసుకోలేము."

– పులులు 1/2

# భూమిక

ఈ శతాబ్దం పూర్వార్ధంలో "తెలుగులో ప్రథమ శ్రేణికి చెందిన కవులెవరు?" అని ఆంధ్రేతరు లెవరైనా అడిగితే-కృష్ణశాస్త్రి, విశ్వనాథ, నండూరి, శ్రీ శ్రీ అని చెబుతూ ఉండటం పరిపాటి. గురజాడ, రాయప్రోలు, తిరుపతి వేంకట కవులు లాంటి ఆధునికాంధ్ర కవితా వైతాళికుల్ని కాదని ఈ నలుగురినే ప్రథమ శ్రేణి కవులనడంలో ఒక సబబుంది. ఒకటి : తమ తమ కవితా మార్గాల్లో అంతకంటే మెరుగు పెట్టడం అసంభవం అనిపించేటంత ఉజ్జ్వల ప్రతిభ వారు ప్రదర్శించారు. రెండు : పొగడ్తలతోనో, తెగడ్తలతోనో సమకాలీన సమాజం తక్కిన కవులకంటే తమనే ఎక్కువగా పట్టించుకోవడం తప్పనిసరి చేసిన బలమైన కంఠాలు వారివి. మూడు : వేషభాషలతో సహా డజన్లకొద్దీ కవులు తమను అనుకరించేట్టు చేసుకున్న విలక్షణమైన వ్యక్తిత్వాలు నలుగురివీ!

నలుగురిలోనూ కృష్ణశాస్త్రి, విశ్వనాథా మరింత బహిర్వర్తులు (Extroverts) ; తమ వక్తృత్వ ప్రతిభతో సమకాలీన సమాజానికి మరింత దగ్గర అయినవారు; వివిధ సాహిత్య ప్రక్రియలు చేపట్టిన వారు; చేపట్టిన ప్రతిప్రక్రియమీదా ప్రస్ఫుటమైన తమ ముద్ర నిలిపినవారు!

'కృష్ణశాస్త్రి వ్యాసావళి' తొలి రెండు సంపుటాలూ 'లోచూపు' గల సాహిత్య విమర్శకుడుగా కృష్ణశాస్త్రిని అధ్యయనం చేయడానికి ఉపకరిస్తే, అద్భుత 'పద చిత్ర' కారుడుగా ఆయన కైవాడాన్ని మదింపు కట్టడానికి తోడ్పడుతుంది – 'మహావ్యక్తులు' అనే ఈ మూడో సంపుటం.

తెలుగులో పద చిత్ర రచనా ప్రక్రియ అంతగా పరిపుష్టం కాలేదు. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 'ఆంధ్ర రచయితలు', శ్రీ తిరుమల రామచంద్ర 'మరపురాని మనీషి', శ్రీ వేమూరి రాధా కృష్ణమూర్తి 'ఏరిన ముత్యాలు' వంటి పద చిత్ర సంపుటాలు కొన్ని వచ్చినా, వాటిలో జీవిత విశేషాలకు ఉన్నంత ప్రాధాన్యం సజీవ మూర్తి కల్పనకు కన్పించదు. ఒక కార్టూనిస్ట్ ఒక నాయకుడి పోలికలు స్ఫురించేట్టు రేఖా చిత్రం గీయవచ్చు; కాని తపస్వీ, ద్రష్టా అయిన ఉత్తమ కళాకారుడు గీసే రేఖా చిత్రం వేరు. బాహ్యమైన ఆ వ్యక్తి పోలికలు మాత్రమే కాక, అతని ఆంతర వ్యక్తిత్వాన్ని ప్రదర్శించే రేఖల్ని ముఖ్యంగా ఆ కళాకారుడు పట్టుకుంటాడు; మళ్ళీ మళ్ళీ చూడాలనిపించే అద్భుత కళాసృష్టి అతడు చేస్తాడు. జర్నలిస్టుల పద చిత్రాలకూ, అంతర్దృష్టి గల మహాకవి పద చిత్రాలకూ అలాంటి తేడా ఉంటుంది.

ఉదాహరణకి–వీరేశలింగాన్ని గూర్చిన మొదటి పద చిత్రం* లో ఒక్క తేదీ కూడా మనకి కనిపించదు. తేదీలు అనవసరం. ఆయన ఎప్పుడు పుట్టాడో, ఎప్పుడు చనిపోయాడో తెలియడం వల్ల ఆ మనిషి మనకి తెలియడు.

"వీరేశలింగం నాసికా త్ర్యంబకం. నవ్యాంధ్ర జీవితం అఖండ గౌతమి. నూరేళ్ళ ఈ మధ్య ఉన్న తెలుగు వారందరూ వారికి తెలియ కుండానో తెలిసో వీరేశలింగంలో ఉన్నారు–అందరూ, అందరూను!" – పుట 3

---

* 122వ జయంత్యుత్సవ సభ (28–6–1970) లో చదివించిన ప్రసంగం

ఇలా–తెలుగువారిలో ఆధునికత్వాన్ని అవతరింపజేసి, నూరేళ్ళ ఈ మధ్య ఉన్న తెలుగు ప్రజలందరి జీవితాల్లో కలిసిపోయిన ఆ జ్యోతీ రూపాన్ని మన మనో నేత్రం ముందు కట్టడం ఉత్తమ 'పదచిత్ర' లక్షణం!

వీరేశలింగం భౌతిక రూపం ఎలా ఉండేదో ఆయన ఫొటో మనకు చెబుతుంది. పదచిత్ర కారుడు దాన్ని వర్ణించనక్కరలేదు. ఆయన ఆత్మభవనంలోని మారుమూల గదులలో కూడా టార్చి లైటు వేసి చూపించడం పదచిత్ర కారుడు చేయవలసిన పని.

**"ఆయనకు అలవికాని కోపం ఉండేదనిపించేది అందరికీ. రాజు అవనీ, రెడ్డి అవనీ–ఎంత మేటి అయినా ఆయన ఎదుట కుంచుకుపోయి, వెనక్కి తగ్గి నిలబడేవాడు– సత్యం సమక్షాన అసత్యపు నీడలాగ; చీకటి మసకలాగ; ఎక్కడో ఏ కొంచెమో మాలిన్యం ఉన్న వ్యక్తి లాగ!**

**"అయితే–అది కోపం కాదంటాను నేను. ఆయన చేత అంతపని చేయించిందే కరుణ ఆయెను!**

"అది తొందర – impatience"

"ఎంతో పని చేయవలసి ఉంది. ఏమో ఎన్నేళ్ళు జీవిస్తాడో! ఎటు చూసినా సమాజం కుళ్ళి ఉంది. – Augean stables లాగు."

పుట 6

భట్రాజు పొగడ్తలాగా కాకుండా, వ్యక్తిలోని అన్ని లక్షణాలనూ యథాతథంగా ప్రదర్శించి వ్యాఖ్యానించడం ఉత్తమ పదచిత్ర లక్షణం!

మనోహరమైన, కళాత్మకమైన ఇలాంటి ఉజ్జ్వల పద చిత్రాల గ్యాలరీ 'మహోవ్యక్తులు' అనే ఈ సంపుటం. వీరేశలింగం, బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడు లాంటి మనీషులూ, సంఘ సంస్కర్తలూ, చిలకమర్తి, రవీంద్రుడు, ఉమర్ ఖయ్యామ్ లాంటి కవులూ, ప్రకాశం, చిత్తరంజన్ దాస్ లాంటి రాజకీయ నాయకులూ తేజోరూపాలతో ఈ పద చిత్రాలలో దర్శనం ఇస్తారు. "బ్రాహ్మ సమాజ జ్యోతులు", "కోపల్లె-ముట్నూరి-భోగరాజు" లాంటి సమూహ చిత్రాలు కూడా కొన్ని ఈ సంపుటంలో కనిపిస్తాయి.

ఈ పదచిత్రాలలో 'ప్రకాశం' పదచిత్రం మరీ కొట్టొచ్చినట్టు కనిపించి విశేషంగా ఆకర్షిస్తుంది. సూక్తులుగా జన వ్యవహారంలో కలిసిపోదగిన వాక్యాలెన్నో దీనిలో కనిపిస్తాయి:

"సామాన్యున కున్న దర్జా సామంతునకే లేదు." – పుట 79

"గద్దె మీదా, గరికెనేలా మీదా ఒకే ఠీవీతో కూచో గలిగిన వాడిదే హుందా!" –పుట 80

"ప్రకాశం మూడు కోట్ల జనం పేరు!" – పుట 80

"ప్రకాశం యాత్రకు గమ్యస్థానం లేదు." – పుట 85

"మెచ్చుకుని వెన్ను చరచ గలడు నొచ్చుకుని వెన్ను చీల్చ గలడు." – పుట 87

తను తెర మరుగున ఉంటూ పురుషుణ్ణి ఆడించే శక్తి స్వరూపిణి స్త్రీ. లోకానికి అంతగా తెలియని కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారి విశిష్ట వ్యక్తిత్వాన్ని చిత్రించే పద చిత్రంలో శాస్త్రిగారు ఇలా అంటారు.

"నిజానికి ఏ మహాపురుషుడు ఉత్తమ మహిళా ప్రభావం లేకుండా లోకోత్తర కార్యాలు చేశాడయ్యా?" — పుట 16

అయితే – ఒక్కమాట చెప్పాలి. ఒక సాహిత్య ప్రక్రియగా తాను పద చిత్రాలు రాస్తున్నానని గాని, ఒక రోజున ఇవన్నీ ఒక సంపుటంగా ఇలా వెలువడుతాయని గాని అనుకుని కృష్ణశాస్త్రి గారు చేసిన రచనలు కావివి. రేడియో వారో, మరొకరో వెంటబడి తరిమి, తరిమి అప్పుడప్పుడు ఆయనచేత వ్రాయించిన వీ రచనలు. పదచిత్ర శిల్పిగా కృష్ణశాస్త్రి ప్రతిభను అధ్యయనం చేయడానికి ఈ సంపుటం ఏ మాత్రం ఉపయోగపడినా సంపాదకుల కృషి చరితార్థం అయినట్లు!

శ్రీ శాస్త్రిగారి అముద్రిత రచనల్ని ప్రచురించడానికి తల పెట్టిన ఈ మహాయజ్ఞంలో అధ్వర్యులుగా ఉండి 'కృష్ణశాస్త్రి సాహితి'కి యథాశక్తి సేవ చేసే అవకాశం మాకు కలిగించిన చిరంజీవి దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి (బుజ్జాయి)కి మేము కృతజ్ఞులం !

సంపాదకులు

* * *

# ఆస్వాదానికి ఆహ్వానం

ఇక్షు సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని, ఆపాత మధుర మయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షురసార్ణవమే. కృష్ణశాస్త్రి పలుకుల్లోని చెరుకు తీపి సాహిత్యరస పిపాసువులకు ఎక్కడో ఉందనుకొనే ఇక్షు సముద్రాన్ని వెదుక్కోవలసిన అగత్యాన్ని తొలగిస్తుంది.

అందుకే పురాణాల్లో పేర్కొన్న ఇక్షు సముద్రం ఎక్కడుంటుందో దాని జాగ్రఫీ జోలికి వెళ్ళదలచుకోను నేను. మన యెదుట నిజంగా కృష్ణశాస్త్రి సాహిత్య సమస్తమూ ఉరకలూ పరుగులుగా ఉప్పొంగుతోంది. ఇదే అసలు సిసలయిన చెరకు రసాల కడలి. ఆస్వాదించుదాం రండర్రా అని అందర్నీ ఆహ్వానిస్తున్నాను.

ఒకప్పుడు కృష్ణశాస్త్రి కవిత్వం మాత్రమే మాధుర్య 'మా' ధుర్యమనుకున్నాము. ఇప్పుడు మీ చేతిలో ఉన్న పుస్తకాన్ని చూడండి. అప్పుడు మాధుర్యం అంటే ఏమిటో మీకే అర్థం అవుతుంది. అప్పుడు వాస్తవంగానే ఒక ఇక్షుసముద్రంలో మీరు ఓలలాడుతారు.

కాని, ఇక్కడో చిన్న విశేషం ఉంది. తినగ తినగ వేము తియ్యనుండు నేమో కాని అంతా చెరుకు రసమే అయితే మొగం మొత్తేస్తుంది. అందుకే కృష్ణశాస్త్రి చెరుకు సముద్రంలో అక్కడక్కడ మిరియాల పొడి ఉంది. కరక్కాయల కసటుదనం ఉంది. ఇంకా మీరు కోరుకునే ఎన్నెన్నో మసాలాలున్నాయి.

ఇప్పుడు నా మనస్సు 50 సంవత్సరాల వెనక్కి పోతోంది. 1920ల ప్రారంభ దినాలవి. ఆ రోజుల్లోనే జమీందారీ కవిత్వాన్ని తోసి రాజని, భావకవిత్వం రంగప్రవేశం చేసింది. 1910-20ల మధ్య ఈ ఉద్యమాన్ని ప్రారంభించిన వారు రాయప్రోలు, అబ్బూరి. అయితే దీనికి 20 లలో అఖిలాంధ్ర ప్రాచుర్యం ఇచ్చిన వాడు కృష్ణశాస్త్రి. బరంపురం నుంచి బళ్ళారి దాకా ఈయన తనవీ, ఇతరులవీ భావగీతాల కవితాగానం చేనస్తూ యువతరాన్ని ఆకట్టుకున్నాడు.

అయితే కృష్ణశాస్త్రిది ప్రతిఘటన లేని విజయయాత్ర కాదు. మహాపండితుడయిన అక్కిరాజు ఉమాకాన్తమ్ "నేటి కాలపు కవిత్వం" అనే పుస్తకం రాసి, అందులో ఎక్కువ భాగం కృష్ణశాస్త్రినే వెక్కిరించాడు. ఉమాకాన్తమ్ (సంస్కృతపు స్పెల్లింగ్ చూడండి!) గారికి సంస్కృతంలో తప్ప మరెక్కడా కవిత్వం కనబడదు. నన్నయభట్టును కూడా ఆయన కవిగా ఖాతరు చెయ్యలేదు. నేటి కాలం కవిత్వానికి కాలం కాదనేశాడాయన.

కాని, ప్రపంచం మాత్రం వేరు విధంగా భావించింది. భావకవిత్వాన్ని ఆనాటి ప్రధాన శాఖగా గుర్తించింది. ఈ శాఖ ఎన్నో

కోకిలలకు ఆశ్రయం ఇచ్చింది. (గౌతమీ కోకిలగా పేరు పొందిన వేదుల సత్యనారాయణ శాస్త్రిని ఇక్కడో చిన్న ఉదాహరణగా ఉటంకించ వచ్చును.) ఈ అన్ని కోయిలల్లో అగ్రస్థానం సాహిత్య విమర్శకులంతా కృష్ణశాస్త్రిదే అని అంగీకరించారు.

"నేటి కాలపు కవిత్వం" ఇప్పుడు లైబ్రరీలలో బూజు పట్టి పోతోంది. కృష్ణశాస్త్రి కవిత్వం భావకవితకు పరాకాష్ఠగా నిలబడింది.

అనంత పంతుల రామలింగస్వామి అనే ఆయన "కృష్ణపక్షం" కావ్య సంపుటిని వేళాకోళం చేస్తున్నాననుకుంటూ "శుక్లపక్షం" అనే రాతని వెలువరించాడు. దాన్ని కూడా ఇప్పుడు చదివే వాళ్ళెవరూ లేరు. ఆ రోజుల్లోనే దాన్ని వేదుల "ఈ శుక్లపక్షం సారస్వతారిష్టం అనే శుక్ల నష్టం" అని చెప్పి సహృదయుల హృదయ ఫలకాల నుంచి తుడిచిపెట్టి పారేశాడు.

1930లలో భావకవిత్వం మీద తిరుగు బాటుగా అభ్యుదయ కవిత్వం వచ్చింది. కాలంతో పాటు ఎదుగుతున్న కృష్ణశాస్త్రి అభ్యుదయ కవిత్వాన్ని ఆహ్వానించి ఆశీర్వదించాడు. అంతేకాదు, అభ్యుదయ రచయితల సంఘం వార్షికోత్సవాలలో ఒకదానికి అధ్యక్షత వహించాడు.

సినీమా రంగంలో ప్రవేశించి, మళ్ళీ ఇలాంటిది రావడానికి వీల్లేదన్నట్టుగా మల్లీశ్వరి రాశాడు.

ఈ మధ్య కాలంలో ఆయన యెన్నో రేడియో నాటకాలు రాశాడు. రేడియో ప్రసంగాలు చేశాడు.

ఆ తర్వాత ఆయన గొంతుక పోయింది. కాగితాల మీద (చిన్న చిన్న నోటుబుక్కుల మీద) అక్షరాలు రాస్తూనే, తన దగ్గరకు వచ్చిన అందరితోనూ ప్రసంగించాడు. ఎన్నో ట్రంకు పెట్టెల నిండా ఈ నోటుబుక్కులున్నాయని బుజ్జాయి (కృష్ణశాస్త్రిగారబ్బాయి) నాతో చెప్పాడు.

ఒక దానిలో కృష్ణశాస్త్రిగారు నా మీద ఇలా రాశారుట: "శ్రీ శ్రీ గొప్పకవి. అతని మీద ఈగవాలినా నేను సహించలేను" అని!

నా మీద వారికెప్పుడూ సదభిప్రాయమే ఉంది. మరి వారి మీద నాకు వల్లమాలినంత అభిమానం. నా మనస్సు మీద చెరగని ముద్రలు వేసిన ముఖ్యాతి ముఖ్యులలో కృష్ణశాస్త్రిని ప్రముఖంగా పేర్కొంటాను.

వారిమీద నా కున్న అభిమానం, ఆపేక్ష వారి యీ గ్రంథ సంపుటాలకు గాను ఈ రాత రాయడానికి ప్రేరేపించాయి. మరో మారు చెబుతున్నాను. ఇది ఇక్షు సముద్రం. "అందరం ఆస్వాదించుదాం, రం" డని ఆహ్వానిస్తున్నాను.

మద్రాసు, శ్రీ శ్రీ

29-11-81

* * *



"బాగా ఆప్తు లుంటారే, బొత్తిగా గుండెలకు పెనవేసుకు పోయిన వాళ్ళు, వాళ్ళని తప్పిస్తే కనుచూపు దాటిపోయిన వాళ్ళందరూ మనస్సులో గూడా మాసిపోతారు....."

— పుట 68



# కృతజ్ఞత

ఇంతవరకూ పుస్తక రూపంలో రాని మా నాన్న గారి రచనలు ఈ నాడు ఈ రూపంలో వస్తున్నాయంటే దానికి ముఖ్యకారకులు శ్రీ బాలాంత్రపు నళినీ కాంతరావు గారు. సుమారు సంవత్సరన్నర క్రితం నేను వారిని సహాయం అడగగానే సంతోషంగా ఈ పని చేపట్టారు. ఆ రోజు లగాయతూ ఈ రోజు వరకూ నిద్రాహారాలు లేకుండా, అక్కడా ఇక్కడా ఉన్న రచనలు చేర్చి, కూర్చి వాటికి ఈ రూపం ఇచ్చారు. వారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. వారి ఋణం నేను ఎప్పటికీ తీర్చుకోలేను.

వారికి చేదోడు వాదోడుగా ఉంటున్న శ్రీ బొమ్మ కంటి శ్రీనివాసాచార్యులుగారికి కూడా నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలకి తొలిపలుకు వ్రాసి ఇచ్చిన శ్రీ శ్రీ గారికి నా కృతజ్ఞతాభివందనాలు.

దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి
(బుజ్జాయి)

# మానవతా మూర్తి
# వీరేశలింగం

వీరేశలింగమూ, నా గురుదేవుడు వేంకటరత్నమూ నా మనస్సులో నిలిచినప్పుడు ఎంతో చెప్పాలని ఉంటుంది. ఎంతెంతో!

బ్రతికున్నప్పుడు మహాపురుషులను గొప్పవారు అని స్వీకరించడానికి మనస్సు ససేమిరా ఒప్పుకోదు. వారిలో కూడా మనలోలాగే సమానంగా ప్రతి దినమూ, ప్రతి నిముషమూ రోగాలూ రొష్టులూ, రాగాలూ ద్వేషాలూ అన్నీ కనబడి, మనకన్న వారు అధికులని అనాలని అనిపించదు.

ఇక గతించిన మహాపురుషులను కూడా ఖచ్చితంగా, సరిగ్గా విలువ కట్టలేము.

వారిని దేవపదవి కయినా ఎత్తుతాము. లేదా, "ఔనూ, కాదు" అన్నట్లు వారికి ఒక చిన్న సర్టిఫికెట్టు అయినా యిచ్చి తోసేస్తాము– "గొప్ప సంఘ సంస్కర్త" అనో, మరేదో అనో!

రామమోహన రాయలు అంటే "విలియం బెంటింక్ సాయంతో సహగమనమును మాన్పించెను" అంటాం. దిక్కుమాలిన textbook లో అంతే ఉంది. అది అప్పగించేస్తాం. ఆయన సమగ్ర

భారతాభ్యున్నతికి ఏ విధంగా మూలపురుషుడో, ఆయన ఏలాగున నవయుగానికి ప్రవక్తో, తొలి విశ్వమానవుడో (universal man), ఆయన చూపించిన గమ్యస్థానాన్ని ఇంకా స్పష్టంగా దర్శించలేక, లోకం యావత్తూ అటు కదలి నడవడానికి గిల గిల లాడుతూ, కిందా మీదా పడుతూ, ఎలాగ ప్రయత్నం చేస్తూందో తెలుసుకోలేము.

అలాగే, వీరేశలింగం అనగానే, "ఆయన విధవా వివాహములు చేయించెను. అనేక గ్రంథములు వ్రాసెను. తెలుగులో మొదటి నవల రచించెను. ఆంధ్ర కవుల చరిత్ర వ్రాసెను. ఆయన ధైర్యశాలి. సంఘాన్ని ఎదిరించెను" అంటూ ఒకటే పాట పాడి ఊరుకుంటాం.

అంతే గాని –

**అఖిన వాంధ్ర శుభోదయ ప్రాప్తి కెల్ల**
**మూల పురుషుం డొకండె, విశాల దృష్టి**
**ఆ మహర్షి నాటిన మహోద్యమ లతికలె**
**సూన పల్లవతతి మోసె...............**

అని గ్రహించము.

సాహిత్య క్షేత్రంలో, సంస్కరణ మార్గంలో, సేవా వీథిలో, రాజకీయ రంగంలో, కృష్ణా గౌతమీ తుంగభద్రా ఘట్టాల్లో, సాగర తీరాల్లో, వనుల్లో, గనుల్లో, కేదారాలలో, కార్ఖానాలలో ప్రబుద్ధమైన చైతన్యంతో దాదాపు నాలుగు కోట్ల ఆంధ్రప్రజ నేడు అవిశ్రాంత కార్యోత్సవంలో మునిగి ఉన్నదంటే, ఆ దుర్వార కర్మధారకు జన్మస్థానం యుగకర్త, ప్రవక్త అయిన వీరేశలింగం.

వీరేశలింగం నాసికాత్ర్యంబకం. నవ్యాంధ్ర జీవితం అఖండ గౌతమి. నూర్చేళ్ల ఈ మధ్య ఉన్న తెలుగువారందరూ, వారికి తెలియకుండానో, తెలిసో వీరేశలింగంలో ఉన్నారు - అందరూ, అందరూను!

వీరేశలింగం విధవా వివాహోద్యమం, మరో ఉద్యమం లేవదీసి నడిపించాడంటే, దాని అర్థం అంతేనా ?

అంతే అయితే, అందరూ ఆ ఉద్యమాన్ని హర్షించే ఈ రోజులలో ఇంకా ఎందుకు ఆముదం లాగున ఆమాటే అనడం ?

ఆయన పని ఏనాడో అయిపోయిందన్న మాట !

ఊఁహూఁ-అది కాదండి ! ఆ ఉద్యమం నడిపిస్తూ ఆయన ఆంధ్రజనాన్ని ఈ విధంగా హెచ్చరించారన్న మాట;

"ఇదిగో, ఇది మన జాతి. ఇది ప్రస్తుతం తెగ కుళ్ళి ఉంది. దీనిలో మౌఢ్యం, అంధకారం, కల్మషం, కౌటిల్యం దాస్యం చిక్కగా మూగి పోయి ఉన్నాయి. ఉదాహరణకు చూడండి - ఈ బాల విధవల దుస్థితి, ఈ హరిజనుల దుర్దశ, ఈ కళావంతుల హేయ పద్ధతి! వీటినన్నిటినీ, ఇంకా ఇట్టివాటిని ఎన్నిటినో మనం తొలగించి పారెయ్యక పోతే ఎలాగ ? దాస్యా లన్నిటిలోనూ మనోదాస్యం మరీ చెడ్డది. అది వదలించుకోకపోతే ఎలాగ ? ముందు నీ మనస్సును కట్టి పెట్టిన సంకెల తెంచేస్తాను. కొన్ని సంస్థలూ, ఆచారాలూ మనకు ప్రియతమమై పోయాయి. అవి మనకు సంకెళ్లని అసలే తెలియదు. నీకు భయం లేదు. వానిని బద్దలు కొట్టేయ్ ! భయ మెందుకు ? సత్యానికి బయమేమిటి ? ధర్మం,

న్యాయం, కరుణ వీటికి బెదురేమిటి? ఇదుగో నా వైపు చూడండి! ఇలాగ ! ఇదుగో, ముందు ఈ సంకెల బద్దలు కొట్టి చూపిస్తున్నా నిర్భయంగా! చూసేరా? ఇలాగే ముందు ముందు సంకెళ్లనన్నిటినీ మీరు తెంచి పారెయ్యాలి !

**"బూజు, దుమ్ము, ధూళి**
**మూసెను తిమిరాళి!**
**మూసె నీ హవేలీ !**
**పురాణ మీ దివాణం, చెడ**
**బూజు పట్టకుండా –**
**తెరవండీ తలుపులు!"**

అంటూ కర్కశమైనా కరుణార్ద్రమైన హస్తంతో, కోట్ల జనాన్ని ఫెళ్లుమని కొట్టి, లేపి, నిలబెట్టాడన్న మాట!

కనుక వీరేశలింగం విద్యాసాగర్ లాగ వట్టి సంస్కర్త మాత్రమే కాడు.

రామమోహన రాయలు లాగ ప్రవక్త, యుగకర్త.

ఒక గొప్ప విద్వాంసుడూ, విజ్ఞుడూ ఆయన్ని బసవేశ్వరుని తోనే పోలుస్తాడు.

వీరేశలింగాన్ని కీర్తిస్తూ, "ఆయన ఒక మహావ్యక్తి మాత్రమే కాదు – ఆయన ఒక గొప్ప సంస్థ" అనీ, ఒక "మహోద్యమం" అనీ కొందరు అంటూంటారు. అబ్బే! సంస్థలన్నీ ఆయనే! ఉద్యమాలన్నీ ఆయనే ! జనం అంతా కలిసిన జనశక్తి ఆయనే కనుక.

వీరేశలింగం ప్రజ!

వీరేశలింగం మంది, కోట్లమంది.

వ్యక్తికి కులం ఉంది. ప్రజకు లేదు. వ్యక్తికి ఒక మతం ఉంది. జనానికి లేదు. వ్యక్తికి వయస్సు ఉంది, మందికి లేదు. మందికి జనన మరణాలు లేవు. ఉద్యమాలన్నీ కలిసి ప్రజవి.

అది జీవద్వాహిని, అది భాద్రపదంలో గోదావరి. నిత్యమూ జీవనము నింపుకుంటూ సాగిపోవడమే!

వీరేశలింగం కేవలమూ ప్రజ కూడా కాడు.

వీరేశలింగం మానవత.

అప్రతిహతమైన ఆయన బలమంతా ఆ మానవతలోనే ఉంది. ప్రబుద్ధమైన నవయుగ ప్రజాశక్తి అణువు వంటి ఆ అర్భక మూర్తిలో ఇమిడిఉండి, క్రుద్ధ గౌతమి లాగ, రుద్ర ప్రభంజనం లాగ ఆటంకాలన్నిటినీ తుడిచి పెట్టి సాగిపోయింది.

ఎందరో తెలియక అంటారూ –"వీరేశలింగం ఒక్కడూ నూర్రేళ్ల క్రితం సంఘ తిరస్కృతికీ, మృతికీ కూడా భయపడకుండా, ఒక్కడూ, ఒక్కడే, ఎలాగ నిలిచి జయించాడండీ ? అసలు సంఘానికంతకీ అడుగున ఉన్నవాడు స్కూలు మేస్టరు. వాళ్లలో అట్టడుగున ఉన్నవాడు తెలుగు పండితుడు. వీరేశలింగం అట్టి తెలుగు పండితుడు. అంత కలవాడు కాడు. వట్టి అర్భకుడు. ధనికుల్నీ, అధికారుల్నీ, బలశాలుల్నీ, పండితుల్నీ, అందరినీ, సంఘాన్నంతనీ ఒక్కడూ ఎదిరించి ఎలాగ జయించాడండీ ? " అని.

ఒక విధంగా చూస్తే అది నిజం కాదు.

ఆయన్ని చుట్టిముట్టి పీడించిన వాళ్లకే బలమూ తక్కువ, సంఖ్యాబలమూ తక్కువ అంటాను.

కన్నూ, నోరూలేని ప్రజ తెలిసో తెలియకో వీరేశలింగం పక్షమే! ప్రజది ఎప్పుడూ భవిష్యత్కాలం. వీరేశలింగంది రాబోయే కాలం ! ఆయన ప్రతి కక్షులది, పాపం, పోయేకాలం ! వాళ్ళది శైథిల్యం, ఆయనది చైతన్యం.

చిదికి, బీటలువారి, కూలిపోతున్న మందిరాన్ని వాళ్లు "వదలము" అన్నారు. ఆయన వాళ్లను కూడా పట్టుకుని కొత్త మందిరంలోనికి తీసుకుపోయి తీరతానన్నాడు. కనుక వాళ్ల పక్షమే బలహీనమైనది.

ఇక్కడ ఒక్క మాట :

ఆయనకు అలవి కాని కోపం ఉండేదనిపించేది అందరికీ. రాజు అవనీ, రెడ్డి అవనీ, ఎంత మేటి అయినా, ఆయన ఎదుట కుంచుకుపోయి, వెనక్కితగ్గి నిలబడేవాడు – సత్యం సమక్షాన అసత్యపు నీడలాగ, చీకటి మసక లాగ, ఎక్కడో ఏ కొంచెమో మాలిన్యం ఉన్న వ్యక్తిలాగ !

అయితే అది కోపం కాదంటాను నేను. ఆయన చేత అంత పనిచేయించిందే కరుణ ఆయెను!

అది తొందర –impatience !

ఎంతో పని చేయవలసి ఉంది ! ఏమో ఎన్నేళ్లు జీవిస్తాడో! ఎటు చూసినా సమాజం కుళ్లి ఉంది. Aegean stables లాగు.

అంతులేని మాలిన్యం – త్వరగా త్వరగా, త్వరత్వరగా తాను ఎంతో పని చేసి మరీ వెళ్లిపోవాలి. ప్రతీ విషయమూ ప్రతీ ఒక్కనికీ, వాద ప్రతివాదాలు చేస్తూ నచ్చచెప్పుతూ పోతానంటే ఎప్పటికి తేలడం? ఏం చేయడం ? "చెయ్!" అంతే! "ఊఁ!నడు!" అంతే ! తొందర! తొందర ! తొందర!

భయంకరమైన, తీవ్రాతి తీవ్రమైన ఆ కార్యోత్సవంలో ఆయనకు మరణించడానికి తీరిక లేకపోయింది.

లేకపోతే ఆ దుర్బల శరీరం చిన్నతనంలోనే రాలిపోయి ఉండేది.

ఆయన జీవితానికి స్తిమితం లేదు. ఎప్పుడూ నడకే ! వట్టి కదలిక కాదు – అది మనది.

వట్టి నడకకు గమ్యస్థానమూ ఉండదు; తీర్చి దిద్దిన మార్గమూ ఉండదు.

మన మందరమూ సాధారణంగా చూపు ఒక వైపు, నడక మరియొక వైపు ఉన్నట్టు ఉంటాం. కొందరం శరీరం గదిలోనూ, తల కిటికీలో నుంచి ముందుకు చాపినట్టూ ఉంటాం.

ఆ ద్రష్టకు, ఆ మహర్షికి లక్ష్యం, గమ్యస్థానం సుస్పష్టం. కనుక ఏ చేయో, కాలో, ముక్కో ముందుకు చాపి ఆ కాస్తా, ప్రగతి అనుకోక, మనిషి మనిషే పూర్తిగా ముందుకు నడవాలన్నాడు; సమాజం కూడా అలాగ నడవాలన్నాడు.

ఒక్కొక్కప్పుడు మాకు అనిపించేది – ఆ ప్రచండునిలో ఎక్కడయినా చల్లదనమూ, తీయదనమూ ఉన్నాయా అని !

అలాగ అనుకోవడం మా దృష్టి లోపం.

ఆయనలో తండ్రితనమూ, తల్లితనమూ రెండూ కూడా ఉండేవి.

అనాథనూ, అభాగినినీ రక్షించింది ఆ రెండో గుణమే!

ఆ రెండో గుణం రాజ్యలక్ష్మమ్మ – ఆయన భార్య. ఆమెకు ఆయనమీద అమోఘమైన ప్రభావ ముండేది. ఆమె కరస్పర్శ, మృదుభాషణ ఆయనను ఎంతగా స్వాంతన పరచేవో ఆయన చరిత్ర ఎరుగున్న వాళ్లకు తెలుస్తుంది !

ఆమె చనిపోయాక మరీని ! ఆయన అంతరంగంలోనే ఆమె నివాస మేర్పరచుకుంది. అప్పుడు స్త్రీ పురుష ప్రకృతులు రెండూ ఆయనలో కలిసిపోయి నిండిపోయాయి. భార్య పోయిన తర్వాత రవీంద్రుడు ఒక గేయంలో అదే అంటాడు.

తుది దినాల్లో ద్విజేంద్రలాల్ రాయ్ వ్రాసిన చంద్రగుప్త నాటకంలోని చాణక్యునివలె వీరేశలింగం కనిపిస్తాడు. ఎన్నడో పరమపదించిన భార్యను పదే పదే ఆహ్వానిస్తూ "నీవే మంటావు? ఈ పని చెయ్యనా ?" అని అడుగుతూ అడుగడుగూ వేస్తూన్నట్లు!

ఇక్కడ ఒక్క మాట !

వీరేశలింగంగారిని గురించి స్మరించినప్పుడల్లా మా గురుదేవులు శ్రీ వేంకటరత్నం నాయుడుగార్ని గురించి కూడా చెప్పుకోకుండా ఉండలేను.

దాదాపు అరవై అయిదు సంవత్సరాల క్రితం ఒక ప్రముఖ ఉత్తర భారత పత్రిక వీరిద్దరినీ కీర్తిస్తూ, "దక్షిణ భారతాకాశాన్ని నేడు

రెండు జ్యోతిర్మండలాలు ప్రకాశింపజేస్తూ ఏలుతున్నాయి. వీరుడైన వీరేశలింగం పంతులు, ఋషి అయిన వేంకటరత్నం నాయుడు !" అని వ్రాసింది.

వీరేశలింగం వేంకటరత్నం కంటే ఎక్కువ నవ్యుడని అనిపిస్తుంది. వీరేశలింగమే ప్రబుద్ధ ప్రజ.

భవిష్యత్తు ఆయన !

వీరేశలింగ యుగం ఆయన చనిపోయాక ఇప్పుడిప్పుడే ప్రారంభమయినట్లు తోస్తుంది.

వేంకటరత్నం దూర భవిష్యత్తులోనికి దృష్టి సారించినా, తన శిష్యులకు అంతవరకూ మార్గాన్ని పరచి చూపించినా, తాను మాత్రం యుగ ప్రాంగణాన నిలబడ్డ ఉపదేశకుడిలాగ దర్శనమిస్తాడు.

వీరేశలింగం పంచభూతాలకూ ప్రజలాగే సన్నిహితుడు. కోపాలూ, తాపాలూ, తిక్కలూ, అనురాగాలూ, ద్వేషాలూ - వీటితో జనం లాగే నేల పైనా, ధూళిలోనూ నిలిచి, ఒక్క నిమిషం విశ్రాంతి లేక, ఒక్క కనురెప్ప పాటు విశ్రాంతి నియ్యక, పదిమందిని తిడుతూ కొడుతూ, తాను పది పడుతూ, ఆందోళన పరుస్తూ యుద్ధం చేస్తూ పోతూన్నట్టుంటాడు.

వేంకటరత్నం ఉదాత్తుడులాగ, అంటే aristocrat లాగ దర్శనమిస్తాడు. ఎప్పుడూ సైనాయ్ పర్వత శిఖరం నుంచి, ఒక విశిష్ట సంస్కార అధిత్యక మీదనుంచి దిగనట్టుంటాడు.

వీరేశలింగం పీడిత మానవ జగత్తులో నిలబడి, దానికి జరిగే అన్యాయాన్ని కోసి పారేసి, ఎదిరించిన వారిని తుడిచి పారేస్తానంటాడు.

వేంకటరత్నం అనాథలకోసం, అభాగినుల కోసం తల్లిలాగ తండ్రిలాగ ఆప్యాయంగా చేతులు చాపుతూ, ఓదారుస్తూ వంగుతున్నట్టుంటాడు.

వీరేశలింగం "ఛీ! ఇది అన్యాయం ! జరగడానికి వీల్లేదు. చూస్తానెవరు వస్తారో ! దీన్ని ఖండించి పారేస్తాను" అంటాడు.

వేంకటరత్నం, "అబ్బా! పాపం ఈ దిక్కుమాలిన వాళ్లు ఎలా ఉన్నారో!" అనే ప్రేమమూర్తిలాగు ఉంటాడు!

వీరేశలింగం నడిపిన ఉద్యమాలలో ప్రధానమైనది విధవా పునర్వివాహం. లోకంలో తీవ్రమైన యుద్ధాలకు కారణం అయిందది.

వేంకటరత్నం తలపెట్టిన ఉద్యమాలలో, సంస్థలలో ముఖ్యమైనవి కళావంతుల సముద్ధరణం, అనాథ శరణాలయమూను.

ఇవి వద్దని ఎవరు పోరాడగలరు?

ఒక్కొక్కప్పుడు వీరేశలింగం యొక్క దైవం దండధారీ, సమవర్తీ అయిన లోక శాసకుడనిపిస్తుంది.

వేంకటరత్నం యొక్క దైవం తరిమి తరిమి రక్షించే వాత్సల్యమూర్తి, పతితపావనుడూ అనిపిస్తాడు.

అయితే వీరేశలింగంలో ప్రేమభక్తులు లేవని కాదు. వేంకటరత్నంలో కార్యతత్పరత లేదనీ కాదు.

కాని వీరేశలింగం జీవితచరిత్ర అవిశ్రాంత కార్యోత్సవం లాగ ఉంటుంది. భారతంలో ఒక వీర మానవుని కథలాగ సామాన్య హృదయాలను ఆవేశపరచే తీవ్ర సంఘటనలతో నిండి !

వేంకటరత్నం జీవితచరిత్ర భాగవతంలోని భక్తుని గాథలా ఉంటుంది – స్థూలంగా కనబడని, పట్టుకు దొరకని లక్ష్యాలూ, అనేక ఆవేశాలూ, వేదనలూ – అలాటి వాటితో నిండి !

వీరేశలింగం కథ నాటక రచనకూ, చలనచిత్ర నిర్మాణానికీ ఇట్టే లొంగుతుంది.

వేంకటరత్నం కథ అలా లొంగదు; అది భావకావ్యం, కీర్తన! మొదటిది ఎక్కువ జనరంజకం – ముఖ్యంగా ఈ నేటి కాలంలో.

వీరేశలింగం నవ మానవుడు. రాగల కాలంలో మానవుడు బుద్ధీ, హృదయమూ రెంటినీ బాగా ఉపయోగించుకోవాలి. ఇది విజ్ఞానయుగం. మానవుడు పశువుకాడు. ఏ విషయాన్నైనా స్వంతంగా తన మెదడును ఉపయోగించి పరిశీలించి, తూచి సత్యం తేల్చుకోవాలి. మరి కవి అన్నట్టు, ప్రాక్పశ్చిమాలు రెండూ ఒకే ఒక హృదయం యొక్క రెండు స్పందాలయిపోయినపుడు మానవులందరూ ఒకే ఒక ప్రేమ పాశంతో కట్టబడి, ఒకే ఒక విశ్వ విశాల సంసారంలో ఇమిడి శాంతంగా సుఖంగా బ్రతకాలి ! భగవంతుడికి రెండు కళ్లున్నాయి అంటాయి పురాణాలు – సూర్యుడూ చంద్రుడూ, మానవునకూ ఉన్నవాడికి, రెండు కళ్లే – బుద్ధీ, హృదయం (reason, love). ఈ రెంటిలో దేనికి లోపం వచ్చినా నవ మానవుడు ఈ జగత్తులో మనలేడన్నది వీరేశలింగం సందేశం. ఆయనది మానవతా ధర్మం !

మెథొడిస్ట్ (Methodist) మత ప్రచారకుడైన John Wesley ని గూర్చి ఒక కథ ఉంది. ఆయనకు ఒకసారి ఒక

Vision - ఒక సాక్షాత్కారం కలిగింది. Wesley స్వర్గ ద్వారం దగ్గర ప్రవేశం కోసం నిలబడ్డాడు. "నీ వెవరవు ?" అని ద్వారపాలకుడు ప్రశ్నించాడు. "I am a Wesleyan- నేను వెస్లీ ధర్మ సంప్రదాయానికి చెందినవాణ్ణి" అని జవాబిచ్చాడు. "మేము వాళ్లెవరో వినలేదు" అన్నాడు ద్వారపాలకుడు. "పోనీ ఇక్కడ ప్రాటెస్టెంట్ మతం వాళ్లు ఉన్నారా?" అని ప్రశ్నించాడువెస్లీ. మళ్లీ "ఊహుఁ" అన్నాడు ద్వారపాలకుడు. "క్రైస్తవులు ?" "ఒక్కరూ లేరు!" "మరెవ్వరున్నారు?" "విశ్వాసులు -believers" అన్నాడు ద్వారపాలకుడు.

స్వర్గద్వారం అంటూ ఉంటే అక్కడ ఓ ద్వారపాలకుడంటూ ఉంటే, మొదట నే "మానవుణ్ణి" అని చెప్పి వీరేశలింగం నమ్మకంగా లోపలికి వెళ్లిపోయి ఉంటాడు.

"భారతేర్ మహామానవేర్ సాగర తీరే" అంటాడు, కవిరాజరాజు రవీంద్రుడు. మానవ మహాసాగరం అంటాడు; ఎంత నిజం ఈ మాట !.......

సుఖాలూ, దుఃఖాలూ, మహాకల్లోలాలూ, ఆందోళనలూ, ఆలింగనాలూ, అలజడులూ, ప్రళయ యుద్ధాలూ, మారణ హోమాలూ, పండుగలూ, పబ్బాలూ, వేడుకలూ, ఆశలూ, ఆనందాలూ-వీటితో ఈ మానవ మహాసాగర మధ్యాన నవ యుగారంభ వేళ నిలబడిన నవ మానవుడు, Universal Man తెలుగునాట వీరేశలింగం.

అలాగ నిలబడి ఇలాగ అన్నట్లు నాకు తోస్తుంది :

"ఓ మానవుడా ! నవ మానవుడా ! నీది -అంటే నీ బదులు, నాది ధర్మసమరం సుమా ! నీవు సాధించే విజయం సామాన్యమైంది కాదు. నిన్ను నీచపరచేది కాదు ఆ విజయం. దానివల్ల లభించే ప్రభావం నీ హస్తాల్లోనే గుప్తపరుచుకోలేవు. నీది ధర్మ సమరమయితే నీ అస్త్రాలు కూడా ధర్మయోధునికి ఉచితమైనవే ! నీకు ఆగ్రహం పనికిరాదు. ద్వేషం పనికిరాదు. నైచ్యం, అల్పత్వం, అసత్యం, పిరికితనం నీ దగ్గరకు రానివ్వ కూడదు. ఉషస్సులో తొంగిచూసే ఆశ నీది. ప్రభాతంలో భాసించే విశ్వాసం నీది.

కనుక, ముందు ముందు ఆశకు కూడా అతీతమైన కష్టాలను పడడం, రాతిరి కన్నా, మృత్యువు కన్నా నల్లనైన అవమానాలను క్షమించడం, ఎదిరించడానికి కూడా వీలులేనట్లు కనబడే శక్తుల్ని

త్రృణీకరించడం,

ప్రేమించడం,

ఓర్మితో సహించడం,

శైథిల్యం నుండీ, జరనుండీ నవ జీవనాన్ని సృజించుకోవడం,

చలించకపోవడం,

నీ మార్గం నుండి తప్పుకొనకపోవడం,

నీరస పశ్చాత్తాపంతో క్రుంగక పోవడం,

ఇవన్నీ, అన్నీ నాలాగే నీవూ జ్ఞాపకం ఉంచుకోవాలి సుమా!" అని!

వీరేశలింగాన్ని "దేవత" అన్నాడు రామలింగారెడ్డి.

ఆ మహా మానవసాగర తీరాన నేను ఒకసారి నిలబడి ఆ "దేవత" కూ, నరదేవతల కందరకూ నమస్కరిస్తున్నాను.

1971 జూలై– 'ఆంధ్రప్రదేశ్' – వీరేశలింగం
జన్మదిన సంస్మరణ సంచిక నుంచి.

* * *

## ఆంధ్రదేశము :

# రాజ్యలక్ష్మమ్మగారు

నవీనాంధ్ర దేశ చరిత్ర ఎవరేనా వ్రాస్తే దానిని పంతులుగారికి అంకితం చేసి తీరాలి – అని మా తమ్ముడు అన్నాడు.

అలాగ కాదు; రాజ్యలక్ష్మమ్మగారికే కృతి ఇయ్యాలి. సూక్ష్మ దర్శివైన నీవలాగనడం భావ్యంగా లేదు – అన్నాను నేను.

మనదేశంలో స్త్రీలు మూడు రకాలుగా ఉన్నారు; విద్యావివేకాలు లేకో, పాశ్చాత్య సంఘ జీవితంలోని పై పూతలే పట్టించుకుని ఉత్తమ సంస్కారం అలవరచుకోలేని వెకిలితనం వల్లనో కార్య రంగంలో దూకే మగవాళ్ళ కాళ్ళకి కన్నెతాడులాగ అడ్డుపడే జాతి ఒకటి ! “ఆది జనకుండు, పిమ్మట నధిపు, డవల తనయుడును శాసకుల్ గదా వనిత” కని తన పని నోరు మూసుకుని కాళ్లీడ్చుకుంటూ కూడా కూడా రావడమే అనే రకం రెండోది. “నేను అవనత మస్తకనై అనుసరించేదాన్ని కాను; తోడు నీడగా ప్రయాణం చేసేదాన్ని; అంతేకాదు, నవకవి వ్రాసినట్లు, ‘తోవ చదును చేసేదాన్ని’,

అసలు ఈ అనంత ప్రస్థానం జైత్రయాత్రగా జేగీయమానంగా సాగించడానికి పటిమా, ప్రతిభా ఇచ్చేదాన్ని; వాకిలీ వాడా, సమాజమూ జాతీ సంస్కరించేదాన్ని" అని, సరస్వతై, లక్ష్మియై, సతియై విజ్ఞాన ప్రేమైశ్వర్య సంగమ స్థానము, ప్రయాగ ప్రతి గృహమూ అనే శ్రేణి మూడోది.

రాజ్యలక్ష్మమ్మగారు మూడవ రకంలో వారు; రాజ్యలక్ష్మమ్మ గారు బ్రాహ్మ మహిళ. మానవ సమాజంలో యథార్థ 'బ్రాహ్మ' మూడవ తరగతికే ఎలాగ చెందాలో, అతని జీవితంలో యథార్థ బ్రాహ్మమహిళ అలాగే నిలవాలి. పంతులుగారి 'తోవ చదునుచేసిన' దా తల్లి. పంతులుగారి దుర్వార కర్మ వాహినికి కాలువలు తవ్విగట్లను కట్టినదా వీరనారి. కనుక నవీనాంధ్ర చరిత్ర ఆమెకే అంకితం చెయ్యాలన్నాను.

పోనీ ! ఇంకోలాగ అను. వాగర్థాలని విడదీయలేనట్లు వారినీ విడదీయలేము కనుక, ఇద్దరికీ కృతి ఇస్తానను. నిజానికి ఏ మహాపురుషుడు ఉత్తమ మహిళా ప్రభావం లేకుండా లోకోత్తర కార్యాలు చేశాడయ్యా?

ఏభై సంవత్సరాల క్రితం స్థూల దృగావరణం దాటి జ్యోతిర్లోకంలో విలీనమైన ఆత్మేశ్వరిని అంతరాంత రాకాశంలో ధ్రువతారలాగ ప్రతిష్ఠించుకుని, మొదట వియోగ క్లేశంగా ఉన్న అనుభవాన్ని వివేకం వల్లా, విజ్ఞాన పటిమ వల్లా విమల ప్రేమానందముగా చేసుకుని, తలపుతలపునా, పలుకు పలుకునా, అడుగడుగునా ఆ నక్షత్రమండలాన్ని పలుకరిస్తూ వస్తూ ఉన్న

తపస్వీ, మహర్షీ కనుక మన 'గురుదేవు'డైన బాబయ్యగారు అర్ధశతాబ్ది నుంచి ఆంధ్ర యువ మనస్సునకు ఆశయ పక్షాలు తొడుగుతున్నారు; ఆంధ్ర యువ హృదయాన్ని కరిగించి కావ్యాలుగా జేస్తున్నారు. రవీంద్రుడు 'Lover's Gift and Crossing' లో అంటాడు : 'ఇప్పుడు నీవు వెళ్లిపోయి నాలోకానికి వచ్చావు; ఇప్పుడు నేను సమగ్ర సుందరంగా అయాను' అని !

ద్విజేంద్రలాల్ రాయుల 'చంద్రగుప్త' నాటకంలో చాణక్యదేవుడు పూనుకున్న కార్యం అసామాన్యమైనది. శిథిలమై, నీరసమై, స్వార్థపంకిలమైన నందసామ్రాజ్యాన్ని విధ్వంసం చేసి, జీవవంతమై, స్వచ్ఛసుందరమై మానవ శ్రేయోదాయకమైన భారతలోకం నిర్మించాలి. అప్పుడు ఆయన సప్తమరుత్తులూ జెజ్బా జెబ్బా కలిపినట్లు, త్రేతాగ్నులూ కౌగిలించుకున్నట్లు, ద్వాదశార్కులూ పంక్తి తీర్చినట్టు అనివార్యశక్తితో సాక్షాత్కరిస్తాడు. ఆ చాణక్యదేవుడు భావించే ముందు, పలికే ముందు, పాలించే ముందు ఇట్టే ఒక్కసారి కన్నుమూసో, అట్టే ఒక్కసారి కన్ను పూర్తిగా తెరిచో "నీవేమంటావు?" అని ఎవరినో అడిగి, ఆత్మేశ్వరి ఆలోచన కోసమో, ఆజ్ఞకోసమో నిరీక్షిస్తుంటాడు. ఆ ఆలోచనా, ఆ ఆజ్ఞా లేనిదే అతడు నంద సామ్రాజ్య విధ్వంసి అయి ఉండును కాని, భారత సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్యుడు కాలేడు.

పంతులుగారు తన జీవితంలో మొదటి అర్వై రెండు ఏళ్ళూ ఒకలాగా, తర్వాత పది సంవత్సరాలూ ఒకలాగా – అలాగే నడిపింపబడ్డారు.

అసలు పంతులుగారికీ, ప్రచండ చాణక్యునికీ కొంత పోలిక ఉంది కదూ ? నందరాజ్యం అంటే అంధకారం, అన్యాయం అనుకో – అనాచారం, అవివేకం అనుకో.

ఉత్తమ సతీ సహవాసం అచేతన పదార్థాన్ని చైతన్యవంతం చెయ్యడమే కాక, పశువుని మానవుణ్ణి చేస్తుంది. మానవుని దివ్యుణ్ణి చేస్తుంది. ఇంకో చిత్రం – మానవత్వానికి విలక్షణమైన, అతీతమైన ఒక ప్రబల (super human) శక్తిగా మారిపోయిన వాణ్ణి మళ్ళీ మధుర శాంతమైన మానవలోకంలోకి దింపుతుంది. "ఎప్పుడైన చిత్తోద్రేకము కలిగినప్పుడు నే నెవ్వరిని లక్ష్యము చేయక ముందు విచారింపక తొందఱ పడి మత్తగజమువలె సంచరింప జూచినప్పుడు తానంకుశమయినన్ను మరలించి యుక్త సమయమున శాంతవాక్య సుధారసముతో నన్నప్పుడు మరల స్వస్థచిత్తుని చేయుచుండును." అందుకనే పంతులుగారి కార్యాల్లో మేధా, హృదయమూ, తీక్ష్ణతా, తీయదనమూ కూడా కనిపిస్తాయి.

స్త్రీని గూర్చి గీతం వ్రాస్తూ శాంతినికేతనంలో నుంచి పాశ్చాత్యలోకం దాకా కవి ఏ సందేశం విసిరాడో విన్నావా ?

"సాయం సంధ్య శర్వరిగా కరిగిపోతూంది. సమర రంగంలో మహాయోధులు క్షతగాత్రులై ధూళి శయ్యమీద ఒరిగిపోయారు. రావమ్మా తల్లీ ! నీ మధురహస్తంతో ప్రతీవీరుని ఛిన్నగాత్రానికీ శిశిరాంజనం అవలేపనము చెయ్యి : మర్త్యుణ్ణి అమర్త్యుణ్ణిగా మార్చు."

ప్రతి పురుషుని దైనందిన చర్యలో జీవితం పొడుగునా స్త్రీ చేసే పని నిరూపిస్తుంది ఈ గీతం. అంతే కాదు. "పాశ్చాత్య లోకం పురుషుడు ; ప్రాచి స్త్రీ. అది పౌరుషశాలు లొనర్చే లౌకిక సంగ్రామం; ఇది క్షమా తపస్సులు పరచే పరమపథం. అది పగలు; ఇది రాత్రి. పగలు పైకి చూస్తాం; రాత్రి లోపలున్నదాన్నే అన్వయించుకుంటాం. సర్వమానవ కల్యాణానికి రెండూ ఎలాగ అవసరమో, ప్రతి గృహ వికాసానికీ, సమాజశ్రేయానికీ, దేశకల్యాణానికీ స్త్రీ పురుషుల సంపూర్ణ సమ్మేళనం అవసరం" అని ఈ గేయం ప్రబోధిస్తుంది.

అందుకనే పంతులు గారనగానే సింహంలాగ గర్జిస్తూ, ప్రభంజనంలాగ తరుముతూ, చక్రంలాగ ఖండించే ఒక శక్తి ఒక్కటే జ్ఞాపకం రాక, స్మితాననంతో, స్విన్న నేత్రాలతో, అభయహస్తంతో, అమృతభాండంతో ఆ మాతృమూర్తితానే ముందుకు వచ్చి సాక్షాత్కరిస్తుంది.

నేను కవి ననుకో ! ఏ మహోముహూర్తమందో నా అంతర చక్షువు వికసించి వికసించి ఏ పారలౌకిక దృశ్యమో చూస్తుంది ; నేను మీలోకం దాటి పైకి ఎగిరిపోతాను; షెల్లీ భరతపక్షిలాగ. 'Cloud of fire' అయిపోతాను; ఇంక ఏ మహాకావ్యమో సృష్టిస్తాను. వెనకాలే నా వృద్ధజనని, నా జీవితేశ్వరి పొంచి ఉండి ఎన్నిసార్లు నా స్వర్ణ స్వప్నాలను చిన్న శకలాలుగా జేసి నన్ను ధూళిలోకి లాగలేదు ? నేను జాతీయ యోధుడననుకో ! పొంగిపోతూన్న విశాల వక్షం కింద నాట్యం జేస్తూన్న నా హృదయంలో జన్మభూమిని

ప్రతిష్ఠించుకుని కారాగారాలకీ, కఠిన శాసనాలకీ ఆవల వెలిగే స్వాతంత్ర్య తేజస్సు నందుకుందామని బ్రతుకారా చాచే నా చేతుల్ని ఎన్నిసారులు నా యింటిలోని అబలా విలాపాలు కిందకి ఈడ్వలేదు? 'సర్వమానవ సౌభ్రాత్రం' అంటాను. జాతి కుడ్యాల్లో ఊపిరాడదు నాకు. ఆర్యర్షుల తపస్సు అంటాను. అణా పైసల్లో పడి అడగిపోతాను. అంతకూ కారణం నా యిల్లు! మన సమాజము నీరసంగా ఉంటే దానికి గృహదేవత అయిన స్త్రీ కారణం! నేను విద్యా బుద్ధుల్లో కొంత పెరిగితే నేమి? ఎగరబోతే నేమి? ఎప్పటి కప్పుడు రెక్కలు కత్తిరించే వారు ప్రక్క ప్రక్కనే ఉంటే!

ఈ స్థితి కంతకీ కారణం నేను. నా కుమారుడి మనోవికాసం కోసం, నా మనోవికాసం కోసం నేను పడే శ్రమలో వేయోవంతు నాభార్య సంస్కారానికి వినియోగించడం లేదు. నాభార్య సంస్కారిణి కావడంలేదు కనుక నేనూ ఏమీ చెయ్యలేను; నేను ఎంత తయారు చేసినా నా కుమారుడూ నా ఆశయానికి దూరుడౌతాడు. కనుక నాకేసీ, నేను చేసిన అల్పాల్ప కృషికేసీ, నేను చేయవలసిన కార్య ప్రణాళికకేసి, నా యింటికేసీ ఒక్కసారి చూసి, పంతులుగారికేసీ, ఆ మహాపురుషుని లోకోత్తర జీవితంకేసీ, ఆయన చెయ్యకుండా వదిలిన పనులకేసీ, ఆయన యింటికేసీ ఒకసారి చూస్తే, దానిలో నిత్య జాగ్రన్నేత్రాలతో ఆయన్ని కనిపెడుతూ ఉన్న రాజ్యలక్ష్మమ్మ గారి ముందు మనము ధూళి దాకా శిరస్సులు వంచుతాము. ఆధునికాంధ్ర కుటుంబాలు ఆదిమ దంపతులుగా స్వీకరింపవలసిన వారిద్దరికీ పదే పదే ప్రణమిల్లుతాము.

ఇంకొక విషయం: నాకు తెలుసును బ్రాహ్మధర్మం ద్వారా లభించిన ఆశయము సమగ్రమైనదని. సమస్త మానవ సమస్యలూ సముచితంగా పరిష్కారం అవడానికి నేటి మానవకోటికి దానికంటె వేరే సాధనం లేదనీ నాకు తెలుసును. పరమేశ్వర ప్రసాదంగా నాకు దొరికిన ఈ వరాన్ని ప్రతి నిముషమూ ఉపయోగించకుండా ఉంటే, నేను అహల్య లాగ శిలగా అయిపోవడమే కాక, మానవాభ్యుదయానికి తోడు పడకపోవడంవల్ల అడ్డుగానే వస్తున్నానని కూడా నాకు తెలుసు! ఇంత బాధ్యతాయుతమైన మహాసత్యాన్ని నా మనస్సులో ఎందుకు వెలిగించాడో కదా! నా ఒక్కనిలో ఇంత మహాకార్యం మూగై, మ్రోడై స్తంభించుకునిపోతే ఎలాగ ? ఈ వేదనే పంతులు గారి జీవితాన్నంతా ఊపిరాడని, ఎవరికీ ఊపిరాడనీయని కార్యోత్సవంగా చేసేసింది. ఎందరో పంతులుగారికి కోపం ఎక్కువంటారు. నేను కాదంటాను. అది కోపం కాదు; "అయ్యయ్యో నేను చెయ్యవలసిన పని ఎంత ఉందీ, ఎంత! ఎప్పుడు పిలుపు వస్తుందో! ఒక్కొక్కనికీ బోధించి, నమ్మించి, బుజ్జగించి కార్యరంగంలోకి లాగుతూ ఉంటే ఏ ఒక్కపని అయినా ఎప్పటికౌను? ఊరికే గర్జించి లేవగొట్టి వీపుమీద తట్టి పనికి పురమాయించడమే చేయాలి. అంతే!" అనే తొందర (impatience) అది. ఇలాంటి ప్రళయ జీవితాన్ని అనుసరించడమే కష్టం. కూడా కూడా రావడం కష్టతరం! నడిపించారు రాజ్యలక్ష్మమ్మగారు నెమ్మది నెమ్మదిగా! కాని ఇంకోటి కూడా జ్ఞాపకం ఉంచుకోవాలి. తన్ను

నడిపించేటంత శక్తిగలదానినిగా మొదట ఆమెను తయారు చేసుకున్నారు కూడా పంతులుగారు! ఆయన మాటలివి :

"పదుమూడవయేట కాపురమునకు వచ్చినది మొదలుకొని యంతకంతకు మా యిరువురకును పరస్పరానురాగము ప్రబలి యిద్దఱము నేకాభిప్రాయులము కాఁజొచ్చితిమి. ఆమెకు నాయందుఁ గుదిరిన యవ్యాజ ప్రేమనుబట్టి నాయెడల పరమ విశ్వాసము కలదయి నాతోడిదె లోకమని మంచి కయినను చెడ్డ కయినను సర్వమునందు నన్ననుసరించుచు భ్రమరకీట న్యాయమున నామె నావలె మాఱిపోయెను. అందుచేత నే నే సాహసకార్యము నందడుగు పెట్టినను తాను వెనుకంజ వేయక, నన్ను వెనుక కీడ్వక తోడునీడయై యుండి ప్రోత్సాహవాక్యములు పలుకుచు నన్ను ముందుకు నడిపించుచుండెను".

ఈ వాక్యాలు చదివాక అయినా కేవలము స్త్రీ మీద నేరారోపణము నేను ఎలాగ చెయ్యగలను? నా దోషమే ద్విగుణీ కృతమై పోతూంటే?

రాజ్యలక్ష్మమ్మగారి జీవితంలోని కొన్ని గాథలు: వీటిని చదివేముందు కొన్ని సంగతులు మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి. అప్పుడు ఆంధ్రలోకంలో ఇంకా అంధయుగమే ననీ; ఒక వైపున శ్రావణమేఘమూ, అమావాస్యరాత్రీ కలిసి ఆగ్రహిస్తూ ఆక్రోశిస్తూ ఉన్నట్టు ద్వేషం, కౌటిల్యం, మౌఢ్యం, క్రౌర్యం లాంటి సైనికుల్తో అంధకారం చుట్టూ ముంచెత్తుతూ ఉంటే తానూ తనతో ఏ ఒకరిద్దరూనో పంతులుగారనీ; ఇప్పటికీ ఆ సైన్యంలో ఏ సామాన్య

యోధుడొక్కడితో నైనా మనము పూర్తిగా యుద్ధం చెయ్యలేక పోతున్నామనీ; అప్పుడు ఆ సంగ్రామ మధ్యాన్ని ఒక్కసారీ భర్తను వదలకుండా క్షమాదృఢమయిన హృదయంతో ఉల్లాసంగా రాజ్యలక్ష్మమ్మగారనీ !

వితంతు వివాహ ప్రయత్నాలు ప్రారంభించిన రోజులవి. ఆంధ్రదేశమంతా–ముఖ్యంగా రాజమహేంద్రవరము–అట్టుడికి పోతూంది. బంధువులూ, మిత్రులూ, పూర్వాచారపరాయణులూ, అశేషజనమూ వద్దన్నారు; జాగ్రత్తన్నారు; ఆయన హిమాలయం! కదపలేక పోయారు. రాజ్యలక్ష్మమ్మగారిని పట్టుకున్నారు. లాభము లేకపోయింది. ఆమెను ప్రేమించి పెంచిన మేనమామా, బంధువులూ వచ్చారు; చుట్టుముట్టారు, గొల్లుమన్నారు, మరణాన్ని మించిన ఘోరవిపత్తు వచ్చిందన్నారు; బెదిరించారు; ఏడిచారు. ఆమె మేరువు; చలించలేదు. అప్పుడామె అన్నమాటల్లో ఎంత గొప్పతనం ఉందో గ్రహించండి. భర్తతోడిదే లోకం అనీ, ఆయన్ని వదిత్తే నేను ఏమి అయిపోననీ, మంచి అయినా చెడ్డ అయినా తప్పదనీ, అని, ఊరుకో లేదు. “ఆయన పూనుకున్న పని చాలా గొప్పది. నేను వద్దని చెప్పడమేమిటి? ఎన్ని కష్టాలు వచ్చినా సహాయం చేస్తాననలు.” ఎప్పుడూ పంతులుగారి కళ్ళు బహిరంగంగా చెమ్మగిల్లినట్లు ఎవ్వరూ చెప్పలేదు. ఆ రోజున ఆయన కపోలాలు తడిసి ఉంటాయి. భాద్రపదమునాటి వేయి గౌతములు లోపలకు పొర్లుకుని వస్తే ఆయన హృదయం మాతృహృదయంలాగ ఆంధ్రదేశ మంత విశాలమై ఉంటుంది.

ఆ రోజుల్లో ధూమ శకటాలు లేవు. రాజమహేంద్రవరానికి రాకపోకలకు గంజాం జిల్లా కాశ్మీరమంత దూరంగా ఉండేది. అప్పుడు అంధ దినాలు కూడా కనుక ఎంత సాహసవంతురాలయిన స్త్రీ కయినా గడపదాటడమే కాశీయాత్ర. రాజమహేంద్రవరం రేగిపోతూంది; ఆంధ్రదేశ మంతా అంటుకుంది. స్త్రీ పునర్వివాహోత్సవాలు ప్రారంభమయాయి. ఎక్కడి గంజాం? ఎక్కడి ఆస్కా? ఇద్దరు బ్రాహ్మణ బాల వితంతువులు అక్కడనుంచి బయలుదేరారు– గౌతమీ తీరానికి! కాలినడక! చేతిలో కాసయినా లేదు! బంధు మిత్రుల్ని ఎలాగ ఏమరించారో తెలియదు– విజయనగరం చేరారు. ఒక ఆమె మనస్సు చెదరిపోయింది: పాపం, ఆ తల్లి ఇంక కదలలేక పోయింది. రెండో బాలిక సామాన్యురాలు కాదు. వెనక్కి పూర్వ జీవితం కేసి చూసుకుంది. తన చేతి రాగి పట్టెలలో బంగారం అమ్మింది. మళ్ళీ ప్రయాణం– కాలినడకనూ, మోటుబండ్లమీదాను! ఆమె వారణాశి దక్షిణాన్ని ఉంది. పతిత త్రాణానికి బద్ధకంకణుడైన ఆ మహావీరేశ్వరుడెక్కడుంటే అక్కడికే ప్రణయ యాత్రికుల ప్రస్థానం!

ఇంక ఇక్కడ రాజమహేంద్రవరంలో పంతులుగారు కట్టించిన పురమందిరం తెరుస్తా రా రోజున. రాజ్యలక్ష్మమ్మగారు మిత్రురాంత్రడతో మహోత్సాహంతో చూడ్డానికి బయలుదేరుతున్నారు. మండు వేసంగి, మధ్యాహ్నం రెండు గంటలు, మాసి మాసి, చివికి, చిరిగిపోయిన కట్టుబట్టతో, మార్గాయాసమువల్ల బడలి సడలి శుష్కించి పెంధూళితో వికృతంగా ఉన్న శరీరంతో ఆ యువతి

గుమ్మానికి ఎదురుగా తోచింది. విశ్వ శైశవావస్థలో ఈ మానవ స్వరూపాన అవతరించి యుగయుగాల మహావరణాలు దాటి వస్తూ, యాత్రాపథముమీద పత నాభ్యుదయా లతో పడుతూ లేస్తూ, లోకశాంతికీ, పావిత్ర్యానికీ, ఆనందానికీ, ముక్తికీ వేంచేసిన ప్రణయభిక్షుకి, ప్రణయదాత్రి, ఉత్తమసతి, ఉజ్జ్వల మాతృమూర్తి నిండారా తెరచుకున్న తన హృదయాన్ని తన కళ్ళల్లో మెరపిస్తూ బ్రతుకంతా చాచి తన యింటి మొగసాల సాక్షాత్కరించినప్పుడు మాతృశ్రీ రాజ్యలక్ష్మమ్మగారి మనోవీథిలో ఏ శరజ్జ్యోత్స్న అలముకొని పోయిందో, హృదయావకాశంలో ఏ పాల కడలి పరవళ్ళు త్రొక్కిందో!

ఆమె పురమందిర ప్రయాణం మానుకున్నారు. ఆమెను స్నానం చేయించడం, సుందర వస్త్రములు ధరింపచేయడం, పొరుగింటికి పోయి అన్నము మున్నగునవి తెచ్చి భుజింపచేయడం- ఇంతలో పంతులుగారు వస్తున్నారు! నవ్వు మొగంతో వీధిగుమ్మంవద్ద నిలబడి, ఆయనకి దగ్గరగా వచ్చి, మీ కొక శుభవార్త చెప్తానని లోపలికి ఆయన్ని తీసుకుని వెళ్ళి ఆ ప్రేమాతిథిని చూపించారట! ఆయన హృదయం అప్పుడు ఏమయిందో!

అనంతరం ఆంధ్రప్రముఖులు, భక్తుడు, కవి ఆదిపూడి సోమనాథరావుగారి జీవితేశ్వరి ఆ బాలిక! సుప్రసిద్ధ విదుషీమణి తెలికిచెర్ల వసుంధరాదేవిగారి జనయిత్రి.

పాపం! అక్కడ విజయనగరంలో ఆగిపోయిన భీరురాలు ఏమయిందో! అబ్బ! శ్రీ చరణ స్పర్శలేని ఎందరు శిలాజీవులు!

ఎక్కడెక్కడ ఉండిపోయారో! వారినికూడా వదిలెయ్యలేదు రాజ్యలక్ష్మమ్మగారి అనురాగము. ఇంద్రియ దౌర్బల్యము చేతనో, వంచకుల మోసము చేతనో, ఆ అంధకూపంలో పడిపోయిన అనాథ యువతులకోసం 'పతిత యువతీ రక్షణశాల' అని వారి యింటి కెదురుగా పెట్టి, వారికి చదువు చెప్పడం, వారి చీకటి హృదయాల్లో అమృత కాంతులు పోయడం, వారిని మానవతులుగా చేసి రాజమార్గముమీద వదలడం! ఆమె జీవితకాలంలో అయిదుగుర్ని అలా రక్షించారట! ముగ్గురికి తర్వాత వివాహాలు అయాయి! తక్కిన యిద్దరికీ శిశు హత్యా దోషము రాకుండా కాపాడారట! గర్భవతియై వచ్చిన యొక బ్రాహ్మణ వితంతువుని ప్రసవ వైద్యశాలకి పంపారట! ఆమె అక్కడ తానుగన్న పిల్లను వైద్యశాలాధికారుల కిచ్చి వెళ్ళిపోబోతూంటే, రాజ్యలక్ష్మమ్మగారు పరుగెత్తుకుని వెళ్ళి, తల్లినీ పిల్లనూ తెచ్చి తనయింట ఉంచి పోషిస్తున్నారు- ఇంతలో తన బిడ్డను వారియింట వదలి తన వృద్ధమాత తనకోసం వస్తే ఆమెతో గంజాంమండలంలో తన బంధువులతో చేరాలని ఆ బ్రాహ్మణి వెళ్ళిపోయింది. తనలో జననీ ప్రేమ ఉంటే ఆ వృద్ధురాలు ఎలాగ తీసుకుని వెళ్ళిందో! రాజ్యలక్ష్మమ్మగారికి ఆ బిడ్డ కన్నకూతురయింది. ప్రేమావతి అని పేరు పెట్టుకున్నారట! ప్రేమావతి మన కందరకూ చెల్లెలు!

తమో వాహినిలో పడి మునిగిపోలేక గట్టుమీద ఒక పాదము పెట్టి, చరితహస్తాన్ని అవలంబము కోసం చాచే వారిని పంతులుగారి అభయహస్తం పైకిలాగి ఆనంద జగత్తులో పడేసింది. వైతరణీ వాహినిలో మునిగిపోతున్నా వేద నన్న మాటలేక పాతాళ గర్భంలోకి

పరిగెత్తుతూన్న వారిని రెండుదయా కరాల్లోనూ పట్టుకుని మాతృ వక్షానికి అదుముకుని, తీరాన్ని నిలబెట్టి దూరాన్ని ఉన్న స్వర్గాంగణాన్ని తమ నిర్వక్ర దృఢహస్తం చాపి చూపెట్టిన వారు రాజ్యలక్ష్మమ్మగారు!

ఇంకో గాథ : భార్యాభర్తలిద్దరూ పురమందిరం ప్రక్కనుంచి వైద్యశాలవైపు వెడుతున్నారు. దారిలో ఒక పెద్ద గుంపు దాని మధ్య ఇద్దరు వృద్ధస్త్రీలు చేయి పట్టుకొని తీసుకొస్తూంటే బీటలు బీటలుగా చిదికిపోయిన కపోలముతో, రక్తార్ద్రంగా ఉన్న వస్త్రంతో, విగత కేశ పాశముతో ఒక వేశ్యాంగన ఉంది. బండిలో నుంచి "ఏమిటిది?" అన్నారు రాజ్యలక్ష్మమ్మగారు. "అలాగ అవవలసిందే! జారత్వ శంకచేత దౌడ బద్దలు కొట్టాడు విటుడు! బోగంది. వ్యభిచారిణి" అన్నాడు ప్రక్కనే నిలబడిన ఒక పెద్ద మనిషి! రాజ్యలక్ష్మమ్మగారు వెంటనే భర్తకేసి తిరిగారు, "ఏమండీ! వీరిస్థితిని బాగుచెయ్యడానికి మన మేదైనా చెయ్యాలండీ!" అన్నారు. "వృద్ధత్వం చేత అశక్తులమయ్యాం; మనమిప్పుడు ఏం చెయ్యగలం!" అని ఆ ఏకవీరుడే అప్పుడు అంటే, "ఎందుకండీ సందేహం? అధైర్యపడకూడదు. చేయించే దేవుడు సహాయంగా ఉన్నాడు. వెనక తీయగూడదు" అన్నారు ఆమె!

భోగంవాళ్ళట! వ్యభిచారిణులట! నా ఒళ్ళు కంపర మెత్తుతుంది. నే నా మాట అనలేను, అంటే నా గుండె దహించుకుపోతుంది. ఉత్తమ సంస్కారంతో, వేనవేల సంవత్సరాల విజ్ఞానంతో, పరమ పవిత్రమైన ఆర్యభూమిలో, హిందూ సంఘంలో ఆ "సంస్థ" అలా నిలపెట్టడంచేత నేనే ఆ కపోలాన్ని చిదుక

కొట్టినవాణ్ణి! నేను అలాగ అనగలనా? తలపులో, పలుకులో, పనిలో గడియ గడియకూ అంధకారమూ, కాలుష్యమూ, ద్వేషమూ నింపుతూ పది అడుగులు ముందుకు జీవితయాత్ర సాగించడానికి బదులు పాతిక అడుగులు వెనక్కి జారిపోతున్నవాణ్ణి! నేను అలాగ వేలెత్తి చూపగలనా?

నాదృష్టిలో వెలుగుంటే, నా మనస్సులో విజ్ఞానం ఉంటే, నా హృదయంలో స్వచ్ఛత ఉంటే, హేమంత నిశీథంలో వసంత ప్రభాతం చూడగల విశ్వాసమే ఉంటే, ఆ ఛిన్న కపో లలో, ఆ స్విన్న నేత్ర లో, ఆ జీర్ణ వసన లో నా శరీరాన్ని తన చేతుల్తో లాగే నా జీవితాన్ని తన ప్రేమతో శుభ్ర సుందరంగా కడిగిన మాతృమూర్తిని చూడగలిగి ఉందును కదా-నేను అలాగ అనగలనా? ధర్మ హృదయంతో చూడు - ఆ అవమానిత భారత నారీమణి పాంచాలీదేవి వలె సాక్షాత్కరిస్తుంది. ద్వేషభావంతో చూడు - ఆ మానవతి భోగోపకరణయైన వ్యభిచారిణి వలె గోచరిస్తుంది. నాడామె చెక్కిలి చితికినప్పుడే మన బ్రతుకు కూడా స్వార్థం వల్ల బ్రద్దలయింది.

దయా ప్రేమలతో తడిసిన హృదయాలకి సరిహద్దులుండవు. అబలలంటేనే కాదు రాజ్యలక్ష్మమ్మగారు కరిగిపోవడం. దాహంచేత నాలుక ఇవతలికి చాపి వగరుస్తూ ఉన్నట్లుంటుందే సొమ్మసిల్లిన జంతువులాగ వేసంగి మధ్యాహ్నం - అటువంటి సమయాన పంచముడు ఒకడు పంతులు గారి యింటిముందు వీథిలో స్పృహ తప్పి పడిపోయి ఉన్నాడు. ఆయన కళాశాలకి వెళ్ళారు. ఇరుగు పొరుగు వారినీ, దారిన బోయే వారినీ ఎంతపిలిచినా, ఎంత వేడినా,

ఎవరూ రాకపోవడంవల్ల రాజ్యలక్ష్మమ్మగారి మనస్సు బాధచేత కొట్టుకుపోతూంది. అంతలో కనపర్తి శ్రీరాములుగారు ఆ త్రోవను వెళుతున్నారు. ఆయన్ని వేడితే, చేతిలోని పుస్తకాలు కింద పెట్టితే, ఆయనా ఈమే చెరో వైపూ సాయంపట్టి వారి అరుగుమీద పరుండ పెట్టారు. అతనికి సేవ చేయగా చేయగా తేరుకున్నాడు. ఆ రోజుల్లో అస్పృశ్యతా నివారణ సంఘాలు, హరిజన సేవా పరాయణులూ లేరు. పంచముడికి ఎండదెబ్బ తగలకూడదు; తగిలినా, చనిపోవడం సబబుకాని, సహాయం పొంది బ్రతకడం జన్మహక్కు కాదు కూడాను. ఇప్పుడయినా పంచముడే అని కాక, పేదవాడనో, వీధిలోననో, మన హోదాకి ఏదో లోపమనో పురుషులమే మనలో కొంతమందిమి ఈ సాయం చేయలేము. ధర్మగ్రంథాలు తలగడలుగా పెట్టుకుని పెట్టుకుని సంపాదించిన మనస్సులోని అస్పష్ట భావమో. లేక మనకోసమో, మన మేర్పరచు కున్న కార్య ప్రణాళిక కోసమో అవసరమైన సిద్ధాంతమో మన సర్వ మానవ సౌభ్రాత్రం. అంతరాంతరముల నుండి పొంగి పొంగి, అంచులు దాటి, బహిర్లోకంలో ప్రవహిస్తూ అందర్నీ తడిపే దైనందిన కార్యక్రమం ఆమెకి సర్వమానవ సౌభ్రాత్రం !

ఇటువంటి వెన్ని సంఘటనలు, ఎన్నెన్ని ఆమె జీవితంలో! పంతులుగారి యశస్సులో ఆమె పేరు అడగి పోనక్కర్లేదు – ఒకరి జీవితం ఒకరివల్ల సఫలీకృతమైనది కనుకా, సంపూర్ణం అయింది కనుకా! ఆమె విద్యాసక్తీ, ఆమె ప్రార్థనాశీలమూ సత్యసంవర్ధనుడైన పంతులుగారే పొగిడారు.

పంతులుగారంత విరామంలేని కార్యశీలి లేడు; ఆయన చరిత్ర ఇంత దూరాన్ని చదువుతూ ఉంటేనే మన కూపిరాడదు కూడ. ఆయన ఇంకా చేయకుండా వదులుతూన్న పనుల్ని ఆయనకి నిరూపిస్తూ, తాను కొంతవరకు నిర్వహిస్తూ కూడాకూడా పరిగెత్తినవా రామె!

పంతులుగారు ఎప్పుడూ నిద్రపోయి ఉండ రనిపిస్తుంది నాకు. ఆమెకు నిద్ర అక్కరలేదనిపిస్తుంది – తానాయన్ని కూడా కనిపెడుతూండాలి కనుక! అన్నింటికన్న ఆమెలో ఉన్న గొప్ప సుగుణం సోమరితనం లేకపోవడమే అని పంతులుగారు నిర్ధారించారు. ఆయన కార్యదీక్ష మృత్యువుని గడగడ లాడించి దూర దూరాలని ఉంచింది; ఆ కార్యోత్సవం పూర్తి అయ్యాక ఒక గదిలోనుంచి ఇంకో గదిలోకి ఆయనే హాయిగా నడిచిపోయారు.

నాడు ఇహలోకంలో ఇద్దరూ కలిసి కృషి చేస్తూన్నప్పుడు ప్రతి సాయంకాలమునా ఆయన కళాశాలనుంచీ, కార్యరంగంనుంచీ ఇంటికి రాగానే వీథి గుమ్మంవద్ద మందహాస రంజితమైన ముఖ మండలంతో నిలబడి 'మీ కొక శుభవార్త చెప్తాను' అని చేయి చేయి కీలించి లోపలికి తీసుకుని వెళ్లినట్లే, అవిశ్రాంతమూ, అమోఘమూ అయిన నిరంతర కర్మదీక్షతో ఇహ లోకాన్ని ఉజ్జీవింపజేసి ఆయన జీవితాంతంలో అమరధామం యొక్క ప్రాంగణ కవాటము వద్దకు రాగానే, తన కంటే, జీవితంలోలాగే, ముందే అక్కడకుపోయిన రాజ్యలక్ష్మమ్మగారు దరహాసవదనంతో ఎదురు వచ్చి ఉంటారు.

–ఈ వ్యాసం చిత్తుప్రతి ఇచ్చింది కృ. శా. గారి మనుమలు
శ్రీ వెలమకన్ని సుబ్రహ్మణ్య శర్మ (అడ్వొకేట్, కాకినాడ)

# చిలకమర్తి లక్ష్మీనరసింహం

[ఆంధ్ర అభ్యుదయ రచయితల రెండవ మహాసభ 30-12-1944న చిలకమర్తివారిని సన్మానించిన సందర్భంగా చేసిన ప్రసంగం].

అభ్యుదయ రచయితలు పంతులుగారికి సన్మానం ఏర్పాటు చేయడం, ఆ సన్మానానికి వివిధ కవులను ఆహ్వానించడం గొప్ప విషయం. మాకూ, పంతులుగారికీ ఆప్తబంధుత్వం ఉంది. అందుచే ఈ సన్మాన సభలో మాట్లాడడానికి నాకూ హక్కు ఉంది; పిఠాపురం నుండి ఇంత దూరం నన్ను పిలిపించడంలో ఔచిత్యమూ ఉంది.

నేడు సాహిత్య సేవకులు అనేక సంస్థలలో, అనేక సంఘాలలో పని చేస్తున్నారు. ఒక సంస్థకూ, మరో సంస్థకూ; ఒక సంఘానికీ, మరో సంఘానికీ విభేదాలున్నాయని తలచడం, నిజంగా విభేదాలున్నా లేకపోయినా ఉన్నవని ఇతరులనుకోవడం – ఇదంతా నాకు బాగా లేదు. వీరేశలింగంగారు మొదలుకొని నేటి యువతరం వరకూ అందరం ఒకే కుటుంబం వారం, ఒకే వాహినిలోని వారం. ఒకే జాతివారం. వీరేశలింగం, చిలకమర్తిలాంటి మహావ్యక్తులు

పనిచేసి ఉండకపోతే, మేముండేవారం కాము. నేటి యువకులవరకూ కలిసి ఉండే ఏదైనా ఒక మహా సాహిత్య సంస్థను నిర్మించితే, నేనెంతో సంతోషించుతాను.

గతించిన రోజులే మంచివనే వాడిని కాను నేను. వెనుకటి రోజులకన్న ప్రస్తుత పరిస్థితులు మంచివనీ, రానున్న రోజులు ఇంకా మంచివనీ ఆశ గలవాడను. రోజు రోజుకూ మానవుడు గాని, జాతిగాని అభ్యుదయం చెందవలసిందే గాని, వెనకకు పోవడానికి అవకాశం లేదు. ఈ సత్యాన్ని గ్రహించిన పెద్దలు వీరేశలింగంగారు, లక్ష్మీనరసింహంగారు.

వీరేశలింగంగారు ఒక మహా ఉద్యమం. చిలకమర్తి ఒక మహావ్యక్తి. అలాగే గిడుగు రామమూర్తిగారు ఒక మహా ఉద్యమం. గురజాడ అప్పారావుగారు ఒక మహావ్యక్తి. ఈ మహావ్యక్తులను గౌరవించడంలో విలువ ఉంది.

ఒక్కొక్కరు కొన్ని విషయాల్లో ముందుకు నడుస్తారు. కొన్ని విషయాల్లో వెనుకంజ వేస్తారు. మనిషి వెనక్కు నడుస్తూ చేయి ముందుకు పెట్టితే లాభం లేదు. శరీరం అంతా ముందుకు పోవాలి. సమగ్ర మైనదే అభ్యుదయం అవుతుంది. ఈ అభ్యుదయం వీరేశలింగం గారిలోనూ, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిలోనూ కన్పించుతూంది. లక్ష్మీనరసింహం గారు రాజకీయాలలో సైతం జంకలేదు. కాలవాహినితో పాటు ఏర్పడుతున్న ప్రతీ ఉద్యమంలోను వీరు పాల్గొని సానుభూతి చూపారు. సాహిత్యానికీ – సమాజానికీ గల సన్నిహిత సంబంధాన్ని గ్రహించి, తమ సాహిత్యాన్ని సృష్టించారు.

గిడుగు రామమూర్తిగారు, వీరేశలింగంగారితో 1919లో మాట్లాడుతూ, "వచ్చేది ప్రజాయుగం, వ్యావహారిక భాష యుగధర్మం; మీ రన్నివిధాలా ముందుకు నడిచారు, ఇక వెనుకంజ వేయవద్దు; పాత బంధనాలు పోవాలి, ప్రజలకు శాస్త్రజ్ఞానం అబ్బాలి; ప్రాచీన సంస్కృతి వారి కందజేయాలి" అని కోరితే, వీరేశలింగంగారు వ్యావహారిక భాషా ఉద్యమంపట్ల సుముఖులయ్యారు. చిలకమర్తి కూడా వ్యావహారికభాషను అంగీకరించకపోయినా, భాషను సులభ మొనర్చి, ఆ ఆదర్శాన్నే కొంతవరకు చేరగలిగారు.

ఈ మహాకవి ముసలివాడు కాడు. ఏ మహాకవీ ముసలివాడు కాదు. అతనికి వార్ధక్యం ఉండదు. ఎప్పుడూ తరుణుడే! చిలకమర్తి జీవితంనుండి మనం నేర్చుకోవలసిన మహా సందేశం ఒకటి ఉంది. అది ఆశావాదం. ఆయన కెప్పుడూ నిరాశ జనించలేదు. 'మిల్టన్' ఒకా నొకప్పుడు తన అంధత్వానికి వగచాడు. కాని ఈయన అలా కాదు. బాహ్యదృష్టి లేకపోయి, అంతర్ దృష్టి ఉన్నదా అనిపించు తుంది. వీరి కవిత్వంలో గాని, మాటలలోగాని ఆనందమే కనిపించు తుంది. వీరి హాస్యంలోని గొప్ప తనానికి కారణం వీరి నిష్కల్మష హృదయమే నని నా అభిప్రాయం. బాహ్య ప్రపంచంలోని ఆనందా లను వీరు చూడలేకున్నా, సమస్త విషయాలనూ అర్థం చేసుకొని, తమ కవిత్వంవల్ల బాహ్య ప్రపంచాన్నంతటినీ ఈ మహాకవి ఆనందింపజేస్తున్నారు. ఇది సామాన్య మానవునికి సాధ్యమైన పని గాదు. వీరిని గౌరవించడం ఎంతో ప్రశంసనీయ మైన కార్యం !

– "తెలుగు తల్లి", 1945 ఏప్రిల్.

# బ్రహ్మర్షి గురుదేవులు

"A lamp can never light another lamp unless it continues to burn its own flame. The teacher who has come to the end of his subject, who has no living traffic with his knowledge, but merely repeats his lessons to his students, can only load their minds; he cannot quicken them. Truth not only must inform but also inspire. If the inspiration dies out, and the information only accumulates, then truth loses its infinity. The greater part of our learning in the schools has been wasted because, for most of our teachers, their subjects are like dead specimens of once living things, with which they have a learned acquaintance, but no communication of life and love."

- *Rabindranath Tagore*

ఈ లోకములో గురువులనేకులుందురు; గురుదేవుఁడెన్నఁడెన్నఁడో యవతరించుచుండును. సామాన్య మానవుఁడు గురువు కాఁగలఁడు, కేవలము రుషియే గురుదేవుఁడు కాఁగలఁడు. వసిష్ఠుఁడు గురుదేవుఁడు. వ్యాసుఁడు గురుదేవుఁడు. రవీంద్రుఁడు గురుదేవుఁడు.

పురాణ భారతములోఁ బుట్టినయెడల నాయుఁడుగారు కృష్ణద్వైపాయనుఁడైయుండును. పాశ్చాత్య జగత్తులో జన్మించిన యెడల సోక్రటీసయియుండును. పదియు నెనిమిది పురాణములను నిర్మించి, వేదము 'లేర్పఱించి కట్టి', 'నుడికారము సొంపెసలార' భారతమును రచించి, విశ్వవిశాలమైన తన మనోభాండారములోఁ గిక్కిరిసియున్న యమూల్యపదార్థములను పైలుఁడు, సుమంతుఁడు, జైమిని, వైశంపాయనుఁడు మున్నగు ఛాత్రుల మనఃపేటికలలో నింపుచునే యమృత పదవియే కడపలగాఁ గల యనంత ప్రస్థానము నిర్విఘ్నముగా వారు సాగించునట్లు ప్రబోధించినవాఁడు వ్యాస భగవానుఁడు. కులపతులై, గురుదేవులై, యశఃకాయులై నిలిచియున్న శౌనక, బాదరాయణాదులు యుగయుగములను దాఁటి వచ్చి యీ దివ్యధాత్రి పూర్తిగ నశించిపోకుండునట్లు నేఁటికిని రక్షించుచునే యున్నారు.

ఇఁక యువకుని హృదయము శరత్కాసారముకంటే స్వచ్ఛము. వాని భావన పక్షముల నెన్నఁడును ముడుచుకొనలేదు. వాని గగనహర్మ్యములు పర్వతముకన్న స్పష్టములు, నచలములు గాఁదోఁచును. వాని బ్రతుకే యలౌకికానుభూతికో యంగలార్చును. వాని దాహమునకుఁ బాల కడలి చాలనట్లుండును. మఱియు నవ యుగోదయ మను వసంత సమయములో నొక చేతిలో సమర్పించుటకు నమృత భాండమును, రెండవ కేల స్వీకరించుట కక్షయపాత్రను నుంచుకొని యాశాశల నాహ్వానించు పిపాసాతురుఁడై వాఁడు పఱితెంచును. ఆ తరుణమున నట్టి తరుణులుత్తమ

విద్యార్థులై పరుగు పరుగున విచ్చేసి నపుడు వారికంటె నాతురుఁడై తన మనోభాండారమును హృదయ నిధానమును దెఱచికొని యున్న గురుదేవుఁడెదురుగా నవతరించి పిత్రాలింగనముతో స్వాగత మొసఁగి నప్పు డెట్టి యనుభవములు వికసించును! ఎట్టి సంఘటనలు ఫలించును!

ఏఁబది సంవత్సరము లభిన వాంధ్ర యువకులను రెండు సోపానముల మీఁద నెక్కించి సత్య సాన్నిధ్యమున నిలువఁ బెట్టిన సోక్రటీసు నాయుఁడు గారు; పాఠశాలయుఁ బ్రార్థ నాలయమును, నధ్యాపక పీఠము నాచార్య వేదికయు బ్రహ్మర్షి గురుదేవుల సన్నిధానమునఁ గలసిపోయెడివి.

కవికివలెనే యధ్యాపకునకును దన్మయీభవన యోగ్యత (emotional response), యుద్రిక్త భావన (imaginative fervour) యావశ్యక శక్తులు.

నాయఁడుగారి హృదయము శతతంత్రీ మహతి. ప్రతి వాయునిహతికిని గంపించి పోయెడిది. ప్రతి శిష్యునితోడి యనుభవములే కాక ప్రతి కావ్యములోని యనుభవములును నంద నానిలములై వారి మనస్సు నుఱ్ఱూఁత లూఁగించెడివి. "He is a tube through which all things blow into music".

ఇఁక వారి భావనాశక్తి కవధి లేదు. ఇట్టి తన భావనా పక్షములను దిగంతముల వఱకు విప్పి వైదిక యోగులనాఁటి భాగీరథీ తీరమునకును బదరి కాశ్రమమునకును బ్రయాణమై, యంతలో హాఫిజ్, సాదీ మున్నగు పారసీక భక్తుల మధువనములలో

వ్రాలి, కాలూఁది, యప్పుడే షేక్స్పియరు, వర్డ్సువర్తు, గెటీ, కార్లైలు వంటి పాశ్చాత్య ప్రవక్తల విజ్ఞాన గగన వీథులలో వారి మనస్సు విహారము చేయుచుండెడిది.

అనుభవింపఁ గల యట్టి హృదయముతో, భావింపఁగల యట్టి చిత్తముతోఁ, బ్రబోధింపఁగల యట్టి వాక్ప్రతిభతో నాయఁడుగారు శిష్యులతోఁ గావ్యములఁ బఠించు నపుడు వారి ప్రతి భాషణమును బ్రతి శిష్యునిఁ బ్రత్యేకముగఁ బలుకరించునటు లుండెడిది; ప్రతి సందేశమును వానికే వినుచునట్లుండెడిది.

సాయంకాలము శర్వరిగాఁ గరఁగిపోవు సమయమది. పాఠశాలలోని గదిలో మునిమాపుఁ జీఁకట్లు ముసుఁగు లొత్తిగిలఁ జేయుచుండెను. నూటయేబదిమంది విద్యార్థులు. ఎదురుగాఁ దేజస్తంభమువలె నిలిచిన స్వచ్ఛ సుందరమూర్తి, పాదుషా, ప్రవక్త, గురుదేవుఁడు. మిల్టను పారడైజు లాస్టులో రెండవ పర్వములో స్టిజియన్ కౌన్సిలును వర్ణించు నపుడా యంధకారము నుండి యా యా మహావీరులు కవి మనఃప్రాంగణములో వలెనే విద్యార్థుల మ్రోలను సుస్పష్టముగా మొలచిన ట్లుండెడివారు. ఆలాగు ననే ఫ్రూడ్ పదునాఱవ శతాబ్దపు నావికుల గాథలు; ఆలాగుననే టెన్నిసన్ లాన్సిలట్ – ఇలెయినుల ప్రణయగాథ!

నాయఁడు గా రాంధ్ర యువకునకుఁ బ్రసాదించిన వరములు రెండుః ఉదారాశయశీలము (idealism), తత్త్వదృష్టి. జీవితమును దారకా మండలమునకుఁ దగిలించి యాత్ర సాగించుట; ప్రత్యణువు నందును ననంతత్వమును, బ్రత్యనుభూతియందును బరమార్థమును

బరిశీలింప యత్నించుట. వారి సన్నిధానములో నున్నపు డొక చిన్న తలంపో, యొక చిన్న మాటయో, యొక చిన్న చేఁతయో యనంతవిశ్వములోని కొక్కొసారిగా గవాక్షమును దెఱచెడిది. బ్రైసును గూర్చి చెప్పినట్లు, "To sit beside him ........ is to pass out spiritually into the universe with the most accomplished of guides."

నిజమునకు నాయఁడు గా రొక్క గడియ యైనను సైనాయ్ (Sinai) పర్వతశిఖరమునుండి దిగెడువారు కారు. అవిశ్రాంతముగా నమరజగత్తులో సుస్థిరులైయుండెడివారు. కనుక మహాకవి యనినట్లు లోక మతని కొక యాత్రా వీథి మాత్రమే కాక యొక వసతిగృహము కూడ. సామాన్యముగా మార్గాంతమున మనకుఁ గావలసినది దొరకును. ఈ లోకములోఁ బ్రతి పదమ్మునను మనకు వరము దొరకును; ఏల యన, నీ లోకము తానే యాత్రాపథము, తానే గృహము. కావుననే గురుదేవులు కైలాస శృంగము మీఁదనే యహరహము నివసింపఁ గలిగెడివారు.

ఈ మహోన్నత స్థితికిఁ గారణము మా కెప్పటికప్పుడు గోచరించు చుండెడిది. వారి యంత ర్బాహ్యేంద్రియ నిగ్రహము, వారి యార్జవము, వారి తపస్సు, అర్ధశతాబ్ది నమోఘముగా సాగిన యేకపత్నీవ్రతము - శ్రీరాముని నాఁటినుండి గాథగా వినిపించు చున్నది - కాంతిమూర్తిగా నీ యంతేవాసుల మ్రోల సాక్షాత్కరించినది. "Although it be not shined upon, true as a dial to

the sun", "సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్" అని మమ్ము మేము ప్రశ్నించుకొనెడివారము.

కాని, నాయఁడుగారి నిష్కళంక నీతి దండధరుఁడు కాదు. ఒక్కొక్కని నీతి చండశాసనము; లోపము సహింపలేదు; నా జీవితమును నా మ్రోలనే పెకల్చి దానిలోని కల్మషముల నెట్ట యెదుటఁ బఱచి చూపును. ఇఁక నాకు మిగిలినవి నిరాశ, నిస్పృహ. గురుదేవుని నీతి నాలో నిదురించుచున్న యార్జవ పటిమ నెగసనఁ ద్రోసి నే నెంత సచ్చీలుఁడను గాఁగలనో యనిపించెడిది!

"నీతిపద్ధతి గరువాన నిట్టనిలుచు
తావులం దెల్ల ప్రేమ మస్తకము వంచి
యోర్చి గెలుపొంది పైకొన నేర్చు ననుచు
నలరుఁ దేనియతేట బ్రహ్మర్షిమాట!"

మార్లే పందొమ్మిదవ శతాబ్దిలో నాంగ్ల రాజ్యాంగ లోకమునకు వివేకము (conscience) వంటివాఁడని యొక బుద్ధిశాలి వ్రాసెను. ఏఁబది యేండ్లు బ్రహ్మర్షి తన శిష్యులనువలెనే యఖిలాంధ్రమును బహిర్వివేకమై నడిపించెను. కాని దీనిని నేను లోకోత్తర శక్తియనను. వారికి విరోధుల మనుకొని "ఆక్షేప రూక్షాక్షర ముఖర ముఖులైన దుర్జను" లను దుఃఖితులను గాఁజేసి, యనుచరులనుగా మార్చుకొని, యనుఁగుబిడ్డలుగా నాలింగనము చేసికొనఁగల "సాశ్చర్య చర్యులు" వారు !

యువకుఁడహంకారి. ఎదుటివానిలో నహంకారము నోర్చుకొనలేఁడు. 'అది నీకుఁ దగదు. నీతిపద్ధతి యిది' యని నేర్పఁబోయిన నేవగించుకొనును. ఆలాగుననే 'నా కెంతయో తెలియును; నీ కంతయును నేర్పెద' నన్న యధ్యాపకుని గౌరవింపలేఁడు. గురువు పండితుఁడు కావలయును. పండితునకు వినయ మేకైక భూషణము. 'నే నెంత తెలిసికొనిన వాఁడనో యని కాక నేఁ దెలిసికొనిన దెంత బాగుగ నున్నదో!' యనఁగలుగు వాఁడు గురుదేవుఁడు. ఒకని పాండిత్యము తనమీఁదను నెదుటివాని మీఁదను బాషాణమై కూర్చుండును. ఒకని పాండిత్యము తనకును దన్నుఁ దఱిసిన వారికిని బ్రభా పక్షములను దొడుగును. నాయఁడుగారు గురుదేవుఁడు.

కావ్యకర్తకు వలెనే గురుదేవులకుఁ గూడ నొక విశాల సౌహార్ద, మొక విశ్వప్రేమ యవసరము. వ్యాసునకు ధర్మరాజు నెడ నెంత యభిమానమో శకుని యెడ నంత యనురాగము. షేక్స్పియరునకు ఒథెల్లొ యెడ నెంత యాదరమో ఇయాగొ యెడ నంత సానుభూతి. డికెన్సునకు చజిల్ విట్టు నెడలను, మిసెస్ గేంపు నెడలను సమాన ప్రేమ యనిపించును. కావున వీరు ప్రపంచ కవులు. దుర్యోధనుడు, కాలనేమి, కాసియస్, ఉర్యాహీప్ లేని యాయా కావ్యములు మనకు దుస్సహములు. వారు లేని లోకము కూడ నెంతయో పోఁగొట్టుకొన్న దనిపించును. ఆ కావ్యాత్మలఁ బూర్తిగా గ్రహించుకొని యా కావ్యముల నన్వయించుచుఁ బాఠము చెప్పఁగలుగువానికంత విశాల ప్రేమయు నవసరమే!

ఇంకొక విశేషము: విద్యార్థులలో నన్ని రకముల ప్రకృతులును గలవు. కవికి వలెనే బ్రహ్మర్షియైన గురుదేవునకును నందఱును ననంత యాత్రా మార్గము తుదిని నమరులుగానే గోచరించుచుందురు.

పురాణ భారతమునాఁటి గురుకులములో గురు దేవుఁడుండెడి వాఁడు; గురుపత్నియైన తల్లి యుండెడిది ; అనుఁగుబిడ్డలైన యంతే వాసులుండెడి వారు. నాయఁడుగారి కళాశాల గురుకులము. స్థూల దృగావరణము దాటిపోయిన మా తల్లిగారిని మే మను నిమేషమును గురుదేవునిలో దర్శించుచునే యుండెడివారము. భౌతిక జీవితము చాలించిన ప్రాణేశ్వరి తనలో నవతరించుటచే నసంపూర్ణముగ నున్న తన ప్రకృతి సమగ్రసుందర మైన దని మహాకవి వ్రాసికొనెను. పండిత సమ్రాట్టు, విద్యా వ్యాసుఁడు, సంఘ సంస్కర్త, ధీరోదాత్తుఁడు, వీర మూర్ధన్యుఁడు, మహారథుఁడు నైన గురుదేవుఁడు మా తండ్రి. గోక్షీరముతో, నవనీతముతో, శర్కరతో,శరజ్జ్యోత్స్నతోఁ జేయఁబడిన తన హృదయములో ననాథులకును, బతితులకును నభయస్థాన మిచ్చినట్లే ప్రతి శిష్యునకును ననురాగస్థాన మిచ్చి పెంచుకొనిన గురుదేవుఁడు మా తల్లి!

గురుదేవునకు వియోగ వేదనయైనది మాకు వరమైనది. సామాన్యునకు వేదన వేదనయే! తపస్వికి వేదన సృష్టించు శక్తి నిచ్చును. ఆ శక్తి లోక సంగ్రహార్థము. తీక్ష్ణమగు సూర్యాతపమును బ్రతి రంధ్రమునుండి గ్రహించి గ్రహించి వృక్షము ప్రసూన ఫల సుందరమై మనకొఱకు సాక్షాత్కరించును. వేద నానలము

చల్లార్చుకొని సామాన్య మానవుఁడొక సంతృప్తిని, నొక సుఖస్థితిని, నొక నిద్రావస్థను బొందవచ్చును. కాని యీ వేద నానలమును జయించినవాఁడు ప్రస్తుతలోకమునకును, భావికాలమునకును తేజస్సు నీయఁగల జ్ఞానదీపమును వెలిఁగించుకొనును. వసిష్ఠుని వంటి యార్యర్షుల గాథలను బఠింపుఁడు. ఎంత యగ్నిశోధన, మెంత హాలాహలపానము తా మనుభవించి తమ శిష్యుల మూలమున నీలోకమునకు శాంతికౌముదియు, నమృతమును బ్రసాదించిరి !

కనుక బ్రహ్మర్షియైన గురుదేవు "ఢఘమువలన మఱల్చుచు, హితార్థ కలితుఁ జేయుచు, గోప్యంబు దాఁచుచు, గుణముఁ బోషించుచు, నాపన్నుని విడువక, లేవడివేళ నిచ్చు" సన్మిత్రుఁడై, పితృదేవుఁడై, మా మా కలాశాలలలో మాకు గురుకులవాస మేర్పఱచి, వ్యాసాదులలో నొకఁడై మాకు నేఁటికిని నమరుఁడై వేంచేసియే యున్నాఁడు.

వారి చరణకమలములను నాహృదయ వేదికపై నుంచుకొని నా శిరస్సును ధూళిలో నుంచుచున్నాను.

– కాకినాడ పి.ఆర్. కాలేజీ మాగజీన్ (1939 - 40) సంచికకు అనుబంధంగా వెలువరచిన *"In memoriam"* నుంచి.

* * *

# రవీంద్ర స్మృతి

నాయెదలో త్వదీయ చరణమ్ముల చిహ్నము లెన్నడేనియున్
మాయవ, ఏ నిశీథపు తమస్సులు మూసినగాని; జీవయా
త్రాయత వీథి హాయిగ ప్రయాణము చేయుదు నక్షయంపు పా
థేయముగా గ్రహించి గురుదేవ ముఖస్రుత గీతికా సుధల్ !

ఎన్నో స్మృతులిట్టే మాసిపోతాయి. రవీంద్రుని స్మృతి మాయదు; రేలూ పగళ్లూ ఉండిపోతుంది – "గ్రహ తారా చంద్ర తపనుల" తో, నదీ నగ వనాదులతో! రవీంద్రుని స్మృతి సురపారిజాత పరిమళం. రవీంద్రునికి కాళిదాసు స్మృతి అలాంటిది. రవీంద్రుడంటాడూః "యౌవన రాజ్య పట్టాభిషేకోత్సవంలో సింహ పీఠంమీద నీవు ఆసీనుడ వయ్యావు. నీ చెంతనే నీ దేవి కూర్చుంది. భూమి పచ్చని తివాసీని నీ కాలికింద పరచింది. రత్నాలతోటీ, బంగారపు పువ్వులతోటీ పొదిగిన చాందినీ ఆకాశం నీమీద పట్టింది. ఋతువు లన్నీ మధుపాత్రలు చేతుల్లో పట్టుకుని, కాళిదాసూ! నీ చుట్టూ నృత్యం చేస్తున్నాయి. నాకు నీ స్వర్ణ

యుగంలో పుట్టాలని ఎంతో ఉండి నిట్టూరుస్తుంటాను. నేను కొన్నియుగాలు ఆలస్యంగా పుట్టిన కాళిదాసును" అని. ఔను, మనకు వేలయేండ్లనుంచి వచ్చిన కవికుల గురువు స్మృతిలాగే, ఈ కవిదేవుని స్మృతిన్నీ ఎప్పుడూ పచ్చపచ్చగా పరిమళభరంగా ఉండి తీరుతుంది.

"ఆకుల్ రాలని పూలు వాడని వసంతారామం" వారి కవిత్వం. ఆయన దివ్యసుందర విగ్రహాన్ని సందర్శించి సందర్శించి, ఆయన మోహన కంఠరవాన్ని ఆలకించి ఆలకించి ఒకనాడు వివశులైన వారున్నారు. ఆ మూర్తీ, ఆ వాణీ కనబడకుండా, వినబడ కుండా శూన్యమై పోయిన ఈ బాహ్యలోకాన్ని చూసేప్పటికి అల్పవిశ్వాసులకు ఒక్కొక్కప్పుడు ఒక పెద్ద దిగులు పట్టు కుంటుంది. రవీంద్రుని తుది గీతాలలో ఒకటుంది - చదివితే నాకు మహా దుఃఖం వస్తుంది.

"ఈ మధ్యాహ్నం ఎండ మండిపోతూంది. ఖాళీగా ఉన్న ఆ నా కుర్చీ కేసి నేను చూస్తున్నా. అక్కడేమీ ఊరడించేది కనబడదు. నిస్పృహ వాక్కులు ఏవో ఆ కుర్చీలోన అంతా నిండి, రోదనంలాగ పైకి లేస్తున్నట్లున్నాయి. పోగొట్టుకున్న యజమాని కోసం జాలిగా చూస్తూ, ఒక గుడ్డి దుఃఖముతో, ఏమి జరిగిందో ఎందుకు జరిగిందో తెలియకుండా అల్లల్లాడి పోయే ఒక కుక్క బాధకన్నా ఎక్కువ పదునైనదీ, మృదువైనదీ ఒక బాధ ఆ కుర్చీ కంఠస్వరంలో ఉన్నట్లుంది" అని. ఆ కుర్చీ కున్నంత బాధ గురుదేవుని శిష్యుల హృదయాల కప్పుడప్పుడు కలుగుతుంటుంది.

రవీంద్రుని వ్యక్తిత్వం చాలా విశిష్టం. అభూతం. మహ ఉదాత్తమైంది. లోకం అంత విశాలమైందీనీ. సుందరాతి సుందరమైంది కూడా. చిత్రం, బాహ్యమూర్తికీ, అంతర ప్రవృత్తికీ అంత సామరస్యం ఇంకెవ్వరిలోనూ కనబడదు. కాళిదాసులో ఉండే దనిపిస్తుంది. ఎన్నియుగాల వాసనలో దానిలో పరిమళిస్తాయి. ఎన్ని దేశాల సంస్కృతులో దానిలో వెలుగుతుంటాయి. ఆ వ్యక్తిత్వానికి జాతి లేదు; మతం లేదు; కులం లేదు; వయస్సులేదు. అలాగ అని అది పాతబడ్డదీ కాదు; పరాయిదీ కాదు.

రవీంద్రుడు చిరయాత్రికుడు, పథిక చక్రవర్తి.

ఒక్కొక్క గొప్పవాడు కేవలం పురాణ సంస్కృతివైపే చూస్తూ, "అదే గొప్పది, అంతకంటె మరేమీ లే" దంటాడు. మరొక్కడు తన దేశానిదో, జాతిదో సంస్కరణావరణలోకే చూస్తూ, ఆ గోడ అవతలదాన్ని దేన్నీ రానివ్వ వద్దంటాడు. ఈ రెండు తరగతులవారికీ చారిత్రక దృష్టి లే దన్నమాట. విజ్ఞానదృష్టీ లే దన్నమాట. వారు ప్రయాణమే మానుకున్నారు.

రవీంద్రుని కావ్యాలూ, సందేశాలూ చదివితే, వాల్మీకి నుంచి కాళిదాసు దాక, కాళిదాసునుంచి కబీరుదాక, కబీరునుంచి ఈ రోజుదాక ఒక్కొక్కరి తోనే చెయ్యీ చెయ్యీ కలిపి పాడుతూ అలాగే వస్తూ ఉన్నట్టుంటుంది.

అలాగే ఈ దేశంనుంచి ఆ దేశానికీ, ఆ ఖండం నుంచి ఈ ఖండానికీ ఆరిపోని తన కరదీపికలో విజ్ఞాన స్నేహాలు పోస్తూ, మూల మూలలూ వెలిగిస్తూ తిరుగుతూ ఉన్నట్లుంటుంది.

ఏ నాటినుంచో అలాగే వస్తూ ఉన్నవాడు ఏ నాటికో అలాగే ముందు ముందుకు కూడా పయనిస్తాడనిపిస్తుంది. అందుకే ఒక్కొక్కప్పుడు రవీంద్రునిలో 'పయసులేని తనం' ఉన్నట్టు ఉంటుంది. "నాతో ముసలి వాడవు కమ్ము, అన్నింటికన్న మంచి దింకా ముందుంది" అనే ఆంగ్లకవి మాటలు తానూ అంటాడు రవీంద్రుడు, ఇంకా బాగా.

అందుకనే ప్రస్తుత యుగ ప్రభావాలు ఆయన బాగా పరిశీలించాడు. ముందువచ్చే స్థితిగతులూ గ్రహించాడు. కనుక ఆయన వ్యక్తిత్వానికీ, జాతీయతకీ విరోధం లేదు. జాతీయతకీ, మానవ సభ్యతకీ విరోధం లేదు. ఆయన ప్రత్యేక వ్యక్తికి ప్రాధాన్యం ఇస్తాడు. కాని ఒకలాగే ఇస్తాడు. ప్రత్యేక వ్యక్తి శరీరంలో ఒక అణువు (cell) వంటివాడు. దానికి ప్రత్యేకం జీవం ఉంది. అది ప్రత్యేకంగానూ పెరుగుతుంది. శరీరాన్ని సుందరంగా ఆరోగ్యంగా ఉంచడానికీ పెరుగుతుంది. అలాగే ప్రతివ్యక్తిన్నీ అఖిల మానవకోటి అనే దేహంలో. అలానే వ్యక్తికీ, జాతికీ ప్రత్యేకత ఉంది; అవి ఆరోగ్యంగా అందంగా పెరగాలి. కాని, మానవాభ్యుదయానికీ, ప్రస్తుత సభ్యతకీ అనుకూలంగానూ పెరగాలి.

అందువల్లనే రవీంద్రుని జాతీయత గుడ్డిదీ కుంటిదీ కాదు. ఆయనకు ఏ వ్యక్తీ లోపం లేనిది కాదు. ఏ గ్రంథమూ లోపం లేనిది కాదు. ఏ జాతీ లోపం లేనిది కాదు. కనుక ప్రతి వ్యక్తిపై, ప్రతి గ్రంథంపై, ప్రతి జాతిపై గౌర వానురాగాలే. ఇటు భయం, బానిసతనము, అసత్యం, అజ్ఞానం, అంధాచారం, అలసతా తన

జాతిలో భయంకర లోపాలనడానికి ఆయనకి భయం లేదు. అటు అధికారార్థ మత్తతలమీద, ద్రవ్యావాదంమీద, దురాశమీద ఆగ్రహించడానికీ భయం లేదు. "ఎక్కడ మనస్సుకు భయం లేదో, ఎక్కడ వాక్కులు సత్యగర్భంలోనుంచి దొలుచుకుని వస్తాయో, ఎక్కడ శిరస్సు గర్వంవల్ల ఉన్నతమో, ఎక్కడ వివేక విజ్ఞానధారలు శుష్క సంప్రదాయాచారా లనే ఇసుకలో ఇంకిపోవో, ఎక్కడ లోకంలో పాడు గదులూ, ఇరుకు టరలూ లేవో, ఎక్కడ దుర్వార మైన కర్మధార సంతతముక్తమై అభ్యుదయ మార్గంలో ప్రవహిస్తుందో – అక్కడికి, ఆ స్వర్గంలోకి నా దేశాన్ని మేలుకొలుపు, నీ దయాహస్తంతో నిర్దయగా కొట్టి లేపు" అని అంటాడు ఆయన.

"బుద్ధ దేబేర్ ప్రతి" అనే మరో గీతంలో "బోధి వృక్షచ్ఛాయలో మేలుకున్న వెలుగు అజ్ఞానపు తెరలను చీల్చి వేసింది. నిశితమూ, స్వచ్ఛమూ, నిర్భయమూ అయిన అట్టి విజ్ఞానమూ, మేధా మళ్లీ అలస మనస్సునకు కాంతీ, చైతన్యమూ ఇవ్వాలి" అని ఆక్రోశిస్తాడు. "దేశ దేశ నందిత కరిమంద్రిత తవ భేరీ" అన్న ఉజ్జ్వల గీతంలో ఎంత కర్కశంగా తన దేశాన్ని ప్రబోధిస్తాడు ! "నీ దుందుభి దేశ దేశాల్ని పిలిచింది. నీ పీఠం చుట్టూ మానవు లందరూ గుమి కూడారు. మంగళ ముహూర్తం వచ్చింది. నాదేశం ఏదీ? వెనకనే కాళ్ళీడుచుకుంటూ పాకుతూందా? తన మూటలు బుజాన్ని వేసుకుని అందరితోనూ ముందుకు నడవదేం ? నిత్య జాగ్రన్నేత్రి వైన శక్తీ! గట్టిగా తట్టి లేపు ఆమెను! నీ విజయ కాహళిని వినిపించు. అందరూ మాయలు అనే తెరల్ని

చింపి పారేశారు. బాధపడ్డారు, శ్రమ పడ్డారు. ఈ దేశం మాత్రం రాత్రులూ పగళ్ళూ చేతులు పక్కల్ని వేళ్లాడేసుకుని సిగ్గులేక బద్ధకంగా కూర్చుంది. కొత్త సూర్యుడు ఉదయించాడు. ఏమి యాత్రికులు! ఎందరు యాత్రికులు! మాన వాలయ ప్రాంగణంలో తన్ను తా నవమానించుకుని ధూళిలో పడి ఉంది నా భారతం. మానవ మందిరంలో ఆమెకు చోటు లేదు. లోక మార్గాలన్నీ ఎలాగ క్రిక్కిరిసిపోయాయో! నీ రథ చక్రాల చప్పుడుతో అవి ఎలాగ చకితం అవుతున్నాయో! బాటసారుల పాటలతో ఆకాశం నిండిపోయిందే! పాతబడ్డ పాడింట్లో తలుపులు వేసుకుని కూర్చుంది నాదేశం. ఆమె హృదయమూ, కంఠరవమూ నిశ్శబ్దంలోకి కుంగి పోతున్నాయి. ఆహా! లోకమంతా ఏమి జనం! ఎందరు! ఎందరు! గుండెల్లో, ఛాతీల్లో, భుజాల్లో, కండరాల్లో, ఏమిశక్తి! ఏమి నిర్భయం! అయ్యయ్యో! నా దేశానికి తనంటే తనకే అనుమానం, సందేహం, నిస్పృహ. తన నీడ తన్నే తరుముతుంటే ఎలాగ వణికి పోతోందో! ఓ మహాశక్తీ! చైతన్యదాత్రీ! ఒక్కసారి అతి నిష్ఠురమైన అఘాతంతో లేపి నిలబెట్టు నా దేశాన్ని!"

ఈ తీవ్రతతో మెరిసిపోయే ఆయన దృష్టికి భావి యుగం సాక్షాత్కరిస్తుంది. అభిమానాలూ, ఆవేశాలూ పక్కకి తోయగలిగిన ధీరోదాత్తుడు, కొత్త దనానికి విముఖుడు కాడు, బెదరడు, ప్రస్తుత స్థితిగతులకి నీరసపడే అలతీ, అల్పవిశ్వాసీ కాడు. "హింసాయ్ ఉన్మత్త పృథ్వీ" వంటి గీతాల్లో దురాశా, ద్వేషమూ, స్వార్థమూ వల్ల ఈ లోకంలో కట్టిన మహా నిర్మాణాలు ఫెళ ఫెళ మని కూలిపోవడం,

వాని మీద అసంఖ్యాక మానవకోటి నిలబడి అదే పనిగా నవ నిర్మాణాలతో నవజగత్తు కట్టుకోడం స్పష్టంగా చూస్తాడు. తామే కర్ణధారులై, తామే తెడ్లతో పడవల్ని నడుపుతారంటాడు. తామే పొలాలు దున్ని, తామే బీజాలు చల్లి, తామే కోసుకుంటూ తింటారంటాడు. రాజదండం ఛిన్నభిన్నమైతే, కూలిపోయిన శత సహస్ర రాజ్య నిర్మాణాల మీద నిలబడి శ్రమించే కోటానుకోట్ల మానవుల కంఠ స్వరాలు ఉరుముల్లాగ మోగుతూ, పడుగూ పేకలాగ కలిసిపోతూ, రాత్రీ పగలూ లోక మార్గాల మీద హోరుమంటూ యంటాడు. సమాన సుఖ దుఃఖాలు ఒక్క విశ్వగీతంగా వినిపిస్తూ ఉంటే, రుజాలసతలు దులిపి, భుజం భుజం కలిపి, ఛాతీలు విప్పి, శిరస్సులు ఎత్తి మానవులు తమకోసం శ్రమిస్తూ సమంగా జీవిస్తారంటాడు. ఇతర దేశాల్లో లాగే మన వంగంలో, అంగంలో, కళింగ సముద్రాల్లో, గంగా ఘట్టాల్లో, పాంచాలంలో, బొంబాయిలో, ఘూర్జరంలో సామాన్య మానవుని ఈ నూత్న చైతన్యోత్సవం కలకలం చేస్తూందంటాడు. ఈ గీతాలు చదివినప్పుడు, చిరగాఢ నిద్ర వదలి పాశ్చాత్య పురాణంలో సేమ్సన్ లాగ అశేషమానవకోటి ఒక్కసారి ఒక్క మహాభూతంలాగ లేచి, ఊగి, హుమ్మని, స్తంభాలు చేతుల్లో పట్టుకుని ఊపి ఊపి, ఊపిరాడనీని పురాణ సౌధాన్ని నేలమీదకి ఫెట ఫెట మని విరిచి లాగేస్తున్నట్లనిపిస్తుంది.

ఇట్టి లోకంలో రవీంద్రుడు కేవలం అస్పష్ట స్వప్నాలు పేనుతూ కూర్చోలేదు. మనకి స్వప్న మాత్రంగా ఉన్నవి

ఆయనికి స్పష్టదృశ్యాలు. కనుకనే దుర్వారమైన కర్మ చైతన్యానికి పురికొల్పుతూ ఉంటాడు తన వారిని. ఒకసారి ఇలాగ ప్రబోధిస్తాడు: "రా, స్నేహితుడా, భయపడకు! ఈ కరకు నేలపై అడుగు పెట్టు. ముని మాపులో స్వప్నాల్ని ఏరుకుంటూ కూర్చోకు. ఆకాశంలో తుఫానులు మూలుగుతున్నాయి. మెరపులూ, ఉరుము దెబ్బలూ మన నిద్రమీద పడికొడుతున్నాయి. సామాన్య జీవిత రంగంలోనికి దిగు. రావయ్యా! మాయాజాలకం చిరిగిపోయింది! కరకు రాతి గోడల మధ్య నిలబడు!"

ఇంకో చోట అంటాడు: "సోమరితనపు కలల్లోకి మమ్మల్ని జోకొట్టకు. కదిలించు మమ్ము. ఈ ధూళిలో కుంగిపోయే గుణాన్ని వదిలించు. మా మనస్సుల్ని బంధించే సంకెళ్ళని తెంపి, ప్రారబ్ధ కర్మ మనే దాన్ని తుడిచి వెయ్యి. నిరంకుశ ప్రభువుల కాళ్ళకింద పడేసి మా అభిమానాన్ని చంపే మా అంధత్వాన్ని పోగొట్టు. యుగయుగాల అవమానాల్ని నిర్మూలించు" అని.

రవీంద్రుని సంస్కృతి స్థిరంగా దృఢంగా ఈ భూగర్భంలోకి వేళ్ళని పోనిచ్చి పెనవేసుకున్న వాస్తవిక సంస్కృతిన్నీ, మళ్ళీ పూవులతోటీ, పళ్ళతోటీ, కొమ్మలతోటీ గాలుల్లో, కాంతుల్లో శిరస్సు ఊగించే సత్యసుందర సంస్కృతిన్నీ!

ఇక రవీంద్రుని తుది గీతం – ఆయన అస్తమించిన తరువాత అప్పుల్ని పఠించమని ఆదేశించినది:

"ముందు శాంతి సాగరం పరుచుకుని ఉంది. కర్ణధారీ! దానిమీద పడవను వదులు. నీ వెప్పుడూ సహ యాత్రికుడవుగా,

సఖుడవుగా ఉంటావు. వీనిని నీ అంకంలోకి చేర్చుకో, దయచేసి చేర్చుకో! అనంత మార్గంపై ధ్రువతార మెరుస్తోంది. ఓ ముక్తిదాతా! నీ క్షమా, నీ అనుగ్రహమూ నిత్య యాత్రలో అక్షయ ఐశ్వర్యంగా ఉండుగాక! ఈ నశ్వర బంధాలు తెగిపోవును గాక! ఈ విశాల విశ్వం తన చేతులు చాపి కౌగిలింతలోకి వీనిని తీసుకొను గాక! తన నిర్భయ హృదయంలో అజ్ఞేయ మైన ఆ మహాశక్తిని ఇతను తెలుసుకొను గాక!"

ఈ గీతం వినగానే అఖాతమూ, శాంతమూ, నిశ్చలమూ అయిన క్షీరసాగరమూ, ఆ నడుమ నావా, దానిమీద రాజర్షి కవిదేవుని నిర్భయ సుందర మూర్తీ, దూరాన ధ్రువతారా, ఆవలి తీరం అన్నీ స్పష్టంగా దర్శనమిస్తాయి.

ఇంతలోనే స్మృతిపథంలో "భానుసింహ పదావళి" మొదలుకుని "బలాక" వరకూ, "బలాక" మొదలుకొని "ఫాల్గుని" వరకూ, తుది గీతావితానం వరకూ అన్నీ మెరపుమీద మెరపులాగ తోస్తాయి. రవీంద్రుని దివ్యస్మృతి మాసేది కాదు.

రేడియో ప్రసంగం

* * *

# బ్రాహ్మసమాజ జ్యోతులు

బ్రాహ్మసమాజ మనగానే బ్రాహ్మునకు – ఏవో దేశ కాల పాత్రములచే ఆవరింపబడి ఏవేవో నిర్దిష్ట నియమములచే నడుపబడుఒక మానవ కూటము మాత్రమే కాదు; కలకత్తాలోనో, కాకినాడలోనో నూరేండ్ల నుండియో, ఏబదేండ్ల నుండియో ధర్మజీవనము సాగించుచున్న సాధక సంఘమే కాదు.

బ్రాహ్మసమాజ మనగానే ప్రతి బ్రాహ్మని అంతరనేత్రముల ముందు ఈ విశ్వ మంతయు ప్రకృతితో, ప్రజలతో, నిశాదివములతో, సుఖదుఃఖములతో, పూర్వవర్తమాన భవిష్యత్తులతో, ప్రాక్పశ్చిమము లతో ఒక్కసారి పరచికొనినట్లగును.

బ్రాహ్మసమాజ మనగానే ప్రతి బ్రాహ్మని అంతరంగమును గరుత్మంతునివలె పక్షములు తొడిగికొని పై కెగసిపోవును. వేదకాలమునాడు భాగీరథీతీరమున బ్రహ్మజ్ఞాన నిలయములై, యోగనిద్రాళువులైన తపో వాటికలకు పరతెంచును. సామ్రాజ్య స్వార్థమును తొలగించి, సకల భూతముల యెడ సమాన కారుణ్యమును ప్రసరింపగల బుద్ధిని వికసింపజేసిన అశ్వత్థ మహీజ

చ్ఛాయల కాలూదును. అకలంక వర్తనమువలన, అనివార్య విశ్వాసమువలన అరుణతరమైన ప్రాణరక్తముచే తడుపబడిన శ్లీవాంకము కిరీటముగాగల కలవరిగిరిపై విశ్రమించును. ఎడారిలోని గ్రీష్మాతపము కంటె తీక్ష్ణతర మైన సత్యాఖడ్గముతో, అమావాస్యాంధకారముకంటె సాంద్రతర మైన అజ్ఞాన యవనికను చించి, స్వచ్ఛమైనను సర్వసాధారణమైనదియు, తీక్ష్ణమైనను తీయనైనదియు నగు ధర్మదృష్టిని మేలుకొల్పు ఖర్జూర కేదారఖండములలో విహారము సేయును. మధ్యయుగము నందలి భారత వైష్ణవ గీతాభంగముల మీద, సూఫీ మధుఝురీ మర్మముల మీద, ఫ్రాన్సిస్కన్ బెనిడిక్టైన్ సేవాసమీరముల మీద విశ్రామము గోరని ప్రయాణము సేయును.

బ్రాహ్మసమాజ మనగానే ప్రతి బ్రాహ్మని హృదయ యవనిక మీద ఎంద రెందరు భారతవీరులు, భాగవత శిఖామణులు ఒకరిని మించి యొకరు అవతరింతురు!

శత సంవత్సరములకు పూర్వమే వ్యక్తిగత సాంఘిక జాతీయ మానవ సమస్యల సముచిత పరిష్కారమునకై ప్రతి సామాన్య మానవునకును అందగల సమగ్ర సుందరమైన విధానమును వినిర్మించిన నూతన యుగ నిర్మాత, మహాద్రష్ట, ఋషిసమ్రాట్టు అగు పురుషోత్తముడు 'రామమోహనుడు' సాక్షాత్కరించును.

భౌతికావరణ బద్ధమైనను ఏ భేదమును పాటింపని విశాల విశ్వాలయమును స్ఫురింపజేయు నూతన మందిరములో వెలిగింపబడిన దివ్యజ్యోతిని జీవన స్నేహముతో ఎగసనద్రోయుచు

యజమాని రాకకై యెదురుచూచు సతీమణివలె క్షమా నిశ్చలమును, కరుణా ప్రశాంతమును నగు మూర్తితో 'విద్యావాగీశుడు' పొడగట్టును.

చిరుతప్రాయమునాడే తనలో మేల్కొనిన మెరపును పాశ్చాత్య విజ్ఞాన పరిశీలనమువలన, పారశీక వేదాంత పరిగ్రహణమువలన, ప్రియతమ మగు ఉపనిష న్మంత్రపారాయణమువలన అమర జ్యోతిగా చేసికొని, వివిధానుభవ సంకుల మగు సామాన్య లోకములోనే శాంతి నికేతనము కల్పించుకొని, తానున్నచోటే అందరకు ఋష్యాశ్రమముగా శుభ్ర మనోహరమైన ఆధ్యాత్మిక దృష్టిని అందర యెదుటను మెరపించుచు, యుగ యుగమ్ముల యోగ నిద్రలో సుస్థిరుడైన హిమాలయమువంటి 'వృద్ధమహర్షి' గోచరించును.

మృత్యుశైత్యము క్రమ్ముకొనుచోట అగ్నిమంత్రముతో, నిరాలంబసంశయ వాదము చెలరేగు చోట నిశ్చల విశ్వాసముతో, భోగపరాయణత్వము ప్రబలిన చోట సజీవ వైరాగ్యముతో, దీపస్తంభము వలె మొలిచి, దివ్య దూతవలె నిలిచి, శంఖధ్వని నంటి ముక్త కంఠమును మోగించి మోగించి, బ్రహ్మానంద పరవశుడైన ప్రవక్త 'కేశవచంద్రుడు' నాట్యము చేయును.

ఉచ్ఛ్వాసము కీర్తనముగా, నిశ్వాసము కీర్తనముగా, హృదయ స్పందనము కీర్తనముగా, ప్రతి భావన కీర్తనముగా, పలుకు పలుకు కీర్తనముగా, సెలయేటి తీగల వీణవలె నొకసారి, తారకాతంత్రుల విపంచివలె నొకసారి బ్రహ్మానంద గానమును భారతమునుండి పాశ్చాత్య ప్రపంచమునకు, పాశ్చాత్య ప్రపంచము నుండి భారతమునకు ప్రవహింపజేసిన 'ప్రతాప చంద్రుడు' మూర్తీభవించును.

రామమోహనుని స్వర్ణయుగ నిర్మాణమునకు సాధనమైన సమగ్రాశయము, సత్య సందేశము మనోహర మానవరూపముదాల్చిన విధమున భక్తి మార్గములో భాగవత శిరోమణి యై, విజ్ఞానవీథిలో వేదాంత దేశికుడై, కర్మక్షేత్రములో మహారథుడైన 'ఆనందమోహను' డవతరించును.

అచంచల విశ్వాసమువలన, అనివార్య సత్యమువలన దృఢాతి దృఢమైన హస్తములో స్థాపింపబడిన కరదీపికను ఒక్క నిముసమైనను నేలపై బడవేయక వాడ వాడలలో, గుండె గుండెలలో వెలిగించి వెలిగించి విశ్రామ మెరుగని ప్రచారక సార్వభౌముడగు 'పండిత రాయలు' తాండవించును.

దశ దిశా తంత్రులొక్కటే సుధాశ్రుతిగా ధ్వనించు విశ్వవీణారవము వంటి గీతాంజలిలో, ద్రవ్యావాదము నుండి, లౌకిక సంగ్రామము నుండి పాశ్చాత్యులను, గాఢ నిద్రనుండి, మూఢ జీవితము నుండి ప్రాచ్యులను ప్రబోధించుచు, ప్రాక్పశ్చిమములు రెండును ఒక్క హృదయము యొక్క రెండు స్పందనములే యని తెలిసికొని విశ్వసించి, నిర్వచించి విశ్వభారతిగా ఆచరించి ఎప్పటికప్పుడు ప్రపంచ పరిస్థితులను, భారత వాతావరణమును పరిశుభ్రముగా, ఉన్నతముగా ఉంచుచు మహర్షుల సంప్రదాయమున పెరిగి మహర్షి యైన 'రవీంద్రుడు' విరాజిల్లును.

విజ్ఞాన దృష్టికి విశ్వాస పక్షములు తొడిగి ప్రయాణము చేసి చేసి, శాస్త్రమునకు శాస్త్రమునకు నడుమ నున్న సరిహద్దులన్నియు కరగిపోయిన సీమను, ప్రాణికిని ప్రాణికిని నడుమ లేచిన

కుడ్యములన్నియు చెదరిపోయిన చోటును చేరి, విజ్ఞానైక్యమును, జీవైక్యమును, భావనా స్వప్నముగనే కాక ప్రస్ఫుట దృశ్యముగా తిలకించిన 'జగదీశచంద్రుడు' ఉదయించును.

తాను పెదవి విప్పిన సత్యవాణియై, తాను ప్రబోధించిన వివేక వర్ధనియై, తానాచరించిన హితకారిణియై, ఎదిరించిన వేళ ప్రభాపుంజమై, ప్రభంజన మై, ఎదురు చూచినప్పుడు అభయ హస్త మై, ఆలింగన మై, అఖిలోద్యమములకు ఆదిపురుష డై, దక్షిణ దేశమునకు రామమోహను డైన 'వీరేశలింగము' వెలుగొందును.

ఆంధ్ర యువ మనస్సునకు ఆశయ పక్షములు తొడిగి తొడిగి, ఆంధ్ర యువ హృదయమును అమృతవాహినిగా కరగించి కరగించి, ఈ నాటి పాప పంకములో రేపటికి తపఃకమలముల వికసింపజేసి, ఈనాటి అనాథ జీవితములో రేపటికి శాఖోపశాఖలుగా పెరిగిపోగల సంసార మందారమును మొలిపించి, సర్వలోక కుటుంబ సంసారములో అనాథలేడని ఘోషించుటకు తన హృదయమునే అనాథ శరణాలయముగ జేసికొని, భక్తికి, జ్ఞానమునకు, కార్యోత్సవమునకు మూడు సుందర నిర్మాణములను ఒక్క తావుననే నిల్పి మన కొక ప్రయాగను ప్రసాదించిన గురుదేవుడు బ్రహ్మర్షి 'వేంకటరత్నము' ప్రత్యక్ష మగుచునే యుండును.

బ్రాహ్మ సమాజ మనగానే నూరేండ్ల భారత చరిత్ర క్రిక్కిరిసి క్రిక్కిరిసి, తోదోపు లాడుకొనుచు మన మనస్సుల లోనికి పరవళ్ళు తొక్కుచు ప్రవహింపదా? మహావీర గోవింద రేనడే, పండిత సమ్రాట్టు భండార్కరు, చందావర్కరు, కాశీబాయి నౌరంగీ,

సాధుమూర్తి వాస్వానీ, రాజనారాయణవసుడు, విజయకృష్ణగోస్వామి, అక్షయ కుమార దత్తు, గౌర గోవింద రాయలు, ప్రకాశచంద్ర రాయలు, గాయకాచార్య త్రైలోక్యనాథ సన్యాలు, వీరాతివీర బలదేవ నారాయణుడు, కృష్ణకుమార మిత్రుడు, రుచిరామ్ సహానీ, ఆచార్య ప్రఫుల్ల చంద్ర రాయలు, నారీ శిరః ప్రసూనము సరోజినీదేవి, కవయిత్రి కామినీ రాయ్, నాయక శిరోమణులు సేనుగుప్త, విధాన చంద్ర రాయలు, సర్ నీలరత్న సర్కారు, రాజకార్య ధురంధరులు కృష్ణగోవిందగుప్త, భూపేంద్రనాథ, వసువు ,సత్యేంద్ర ప్రసన్న సింహులు, సీతానాథ తత్త్వభూషణులు, ప్రియతముడగు మన హేమచంద్రుడు, బ్రహ్మగా నాసక్త డాక్టరు రూబెన్సు, రంగారావు, శ్రీధరులు నాయడు, బుచ్చయ్య పంతులు, లక్ష్మీనారాయణ, బాపయ్య, సాంబశివరావు, సీతారామయ్య............ ఎంద రెందరు, ఎందరెందరు ఆ ప్రవాహ తరంగములపై తరగెత్తి వచ్చుచుందురు!

– 'బ్రాహ్మసమాజమనగా' అన్న శీర్షికతో
'ధర్మసాధని' (3–1–1964) లో ప్రకటితం.

* * *

# ఉమర్ ఖయ్యాామ్

ఘియాజుద్దీన్ అబుల్ వతహ్ ఉమ్రబీన్ ఇబ్రహీం అంటే ఎవ్వరూ ఎరగరు. ఖయ్యాామ్ అంటే ఎరగని వారుండరు. ఖయ్యాామన్న పేరు తఖల్లుస్ – పెన్ నేమ్. ఈ పేరు ఎంత పుణ్యాం చేసుకున్నదో !

ఖయ్యాాము కన్న భాగ్యశాలి అయిన కవి మరొకడు కనబడడు. బ్రతికి ఉన్నంతకాలమూ ఒక పాదుషా నాశ్రయించలేదు. మరణానంతరం ఏ మహాకవికీ రాని యశస్సు ఇతనికి వచ్చింది. చిన్ననాటనే అనేక శాస్త్రాలలో అఖండ పండితుడనిపించుకున్నాడు. బాగ్దాదు పాదుషా మలిక్ షా జలాలుద్దీను అంతవాని ఆదరణం అర్థించకుండానే పొందేడు. సతీర్థ్యుడైన నిజాముల్ ముల్క్ అర్పించుకున్న జాగీరులనుభవించాడు. మెర్వ్ సుల్తాన్ సదరుద్దీన్ మహమ్మద్ తానై వచ్చి ఇతనికి కానుక లర్పించుకున్నాడు. సమ్జర్ షా తఖ్త్ మీద జరిగి అర్ధాసన మిచ్చుకున్నాడు. అయినా, 'రాజూ ఒక మానవుడే, నావంటివాడే; పొట్టకోసం ఒకరిని వేడుకోను. ఒక రొట్టె, ఇంత నీరూ నాకు చాలవా?' అని బింకంగా చెప్పుకున్నాడు.

ఇక నడి వయస్సులో పండితులతో గోష్ఠులు కావించాడు. అర్థించిన రాజుల ఆస్థానము లలంకరించాడు. పూల తోటలలో, సెలయేటి ఒడ్డున వన భోజనాలూ, వెన్నెల కొలువు లూ, సాకీ అందిచ్చిన ద్రాక్ష సవాలూ, శిష్యులకు పాఠాలూ, ఎడనెడ ఒక్కొక్క రుబాయీ రచనా-ఇలాగ ప్రాయము జరిగింది.

అయితే కాలమొకే రీతిగా ఉండదు. సుఖ దుఃఖాలు పగళ్ళూ, రేలుల్లాగ తప్పవు. ఖయ్యాముకు ముసలితనం వచ్చింది. అనురాగము చూరగొన్న ఆప్తమిత్రులూ వెళ్ళిపోయారు. వాటితో పూలకారు పోయింది. జీవితమనే పాత్రికలో ఆసవ మడుగంటింది.

"పువ్వులకారు రాకలకు పోయెడి సీతులకున్ రసోజ్జ్వల జ్జీవిత కావ్య పత్రముల చెచ్చెర త్రిప్పిన" ఖయ్యాముకు శోకభారము దిగ ద్రోయగలిగినది ఒక్క ఆసవమే మిగిలినది. అయితే, దిగులు పడ్డాడా? ఇంక "ముదికాయము లేతగిలంగ త్రావెదన్" అన్నాడు. శత్రువులైన ఇస్మయీలి యాలు ప్రభువులై నానా కష్టాలు పెడుతుంటే, 'రుస్తుంజా శత్రువైనా కుంగిపోను, హాతింతాయి మిత్రుడైనా పొంగి పోను" అన్నాడు. ఇతను నూరేండ్ల పండు ముసలియై ఒకనాడు తోటలో విహరిస్తూ ఒక శిష్యునితో అంటాడూః "ఇట్టి చోట నా గోరీ ఉంటుంది తెలుసునా? ఏడాదికి రెండు సార్లు చెట్లూ, లతలూ నా గోరీపై పువ్వులూ, ఆకులూ రాలుస్తాయి" అని. ఖయ్యామ్ గోరీ నిషాపూర్ లో ఒక తోట గోడవారను, చల్లని చెట్ల నీడను నేటికీ ఉన్నది. తొలి ప్రొద్దులా, మలిసందెలా పూలతావుల బరువుతో అలసానిలము ఆప్యాయంగా వచ్చి అతని సమాధి పైన

నేటికీ సుమ దళాలను విసిరి విసిరి పోతూంది. పెట్టి పుట్టినవాడు ఖయ్యామ్!

ఇక మరణానంతరము కూడా ఆ సమాధిని చుట్టి అలరు వాసన అలము కొన్నట్లే అతని కీర్తి ప్రపంచ సాహిత్యలోకం అంతా ప్రసరించింది. ఫిర్దౌశీ, సాదీ, నిజామీ, రూమీ, జామీ, ఫారసీ కవులలో దిగ్గంతులు. హాఫీజ్ వీరిని మించిన ప్రభువు. అయినా ఉమర్ ఖయ్యాముకు లభించిన కీర్తి వీరికి రాలేదు. అంతేకాదు. మరి లోకంలో ఏ ఇతర మహాకవి కావ్యమున్నూ ఇతని రుబాయీలు అనువదింపబడి నన్ని భాషలలోకి అనువదింపబడలేదు.

ఈ ప్రతిష్టకు కారణం ప్రపంచ భాష అయిన ఇంగ్లీషులోకి ఫిడ్జిగెరల్డ్ అంతటి ఘటికునిచేత అనువదింపబడడం అని కొందరు అనుకోవచ్చు. అది కొంతవరకు నిజమే కావచ్చు.

ఉమర్ ఖయ్యామ్ ఆంగ్లంలోకి వచ్చిన కాలంలో అంత ఆకర్షించిన కావ్యం ఇంకొకటి లేదు. పాశ్చాత్యలోకంలో శాస్త్రదృష్టీ హేతువాదమూ ప్రబలుతున్న రోజులవి. ఆవిరి యంత్రం నిర్మింపబడ్డది. విద్యుచ్ఛక్తి యంత్రాలు వచ్చాయి. పరిశ్రమలు వృద్ధి పొందుతున్నాయి. డార్విన్, హక్స్లీ, స్పెన్సర్ సృష్టి తత్వాన్ని గూర్చి విచారించి పరిణామ సిద్ధాంతాన్ని ప్రకటించారు. ప్రజలలో పారలౌకిక చింత సడలింది, ఐహిక చింత హెచ్చింది. మూఢ విశ్వాసాలు మాయమౌతున్నాయి. పూర్వ మతాలు కూకటి వేళ్ళతో కదలడం మొదలుపెట్టాయి. చదువుకున్నవారికి ప్రకృతి శాస్త్రాలమీద ఇష్టం ఎక్కువ అయింది. 'స్వర్గమూ, నరకమూ

అంటూ లేవు. ఈ శరీరం పోయాక ఆత్మ నిలువదు. దైవానికున్నాయని చెప్పే శక్తులన్నీ ప్రకృతివే!' అనే అభిప్రాయాలు ప్రబలం అయాయి.

ఆ సమయంలో "నీ కను మోసల నున్నదియే నిజమ్ము" అన్న ఖయ్యాము వాణి నవ్యంగా, స్వచ్ఛ సుందరంగా వినబడింది తమ వైజ్ఞానిక భావాలు ఖయ్యాము కావ్యంలో ఉన్నట్లు చదువరులకు అనిపించింది.

అయితే నాటి ఖయ్యాము ఆకర్షణ నేటి వరకూ తగ్గలేదు. అంతే కాక పాశ్చాత్య దేశాలలోనే కాకుండా ప్రాచ్యదేశాలలో కూడా అతని కావ్యాలకు అంత ప్రభావం ఎందుకు ఉంది? దీనికి కారణమేమిటి? మానవుని మెదడు మేలుకొన్నది మొదలుకొని ఒక జిజ్ఞాస తప్పడంలేదు. ఈ జీవితం అంటే ఏమిటి? మానవులలో ఇన్ని రకాలూ, ఈ తేడాలూ ఎందుకు? ఎక్కడినుండి వచ్చాం, ఎక్కడికి పోతున్నాం? చావుతో అంతా సమాప్తా, తరవాత ఏదైనా ఉందా? ఇదంతా సృష్టించిన వాడొకడున్నాడా, ఏ ఉద్దేశంతో ఇదంతా సృష్టించాడు? ఈ ప్రశ్నలు అనాదిగా అంకురించడం, రకరకాల సమాధానాలు చెప్పుకోవడమూ జరుగుతూనే ఉంది. వివేకవంతులూ, మేధావులూ ఎందరో ఈ సమస్యల పరిష్కారం కోసం తలక్రిందులుగా తపస్సులు చేశారు. అయితే మానవుని మనస్సులో సందేహాలు సందేహాలుగానే ఉంటున్నాయి. కవితలు కవితలుగానే ఉంటున్నాయి. మెదడును తృప్తి పరచే వేదాంతా లెలాగున ఉన్నా, హృదయానికి శాంతి నిచ్చే దేదో ఉండాలి గదా!

ఏ మానవుడైనా ప్రస్తుతం కోరేది సుఖం గాక మరేం ఉంది? నిజానికి అన్ని విశ్వాసాల అడుగునా, వివిధ మతాల వెనకా, అందరిలోనూ ఒకటే ఆకాంక్ష ఉందనిపిస్తున్నది- ఉన్నంతకాలం సుఖంగా ఉండాలన్నది అందుకనే –"పోయిందేదో పోయింది, వచ్చేదేదో తెలియదు; ఈ క్షణమే నిజం, ఇప్పుడు హాయిగా ఉండు" అని ఎవరు చెప్పలేనంత సొగసుగా, బిగువుగా చెప్పిన ఖయ్యాము అందరకూ ఆప్తుడయ్యాడు.

ఖయ్యాము కాలము నాటికి సూఫీ మతం బాగా వ్యాపించి ఉంది. ఈ మతస్థులు భోగాలు వదులుకుంటారు, పేదతనం స్వీకరిస్తారు. ఎప్పుడూ దైవ ధ్యానంలో మునిగి ఉంటారు. ఆత్మ పరమాత్మల ఐక్యం కోసం సాధన చేస్తారు. వీరి భాషలో ఆసవ మంటే బ్రహ్మానందము; భగవంతుడు ప్రియ. హాఫి జన్నాడు కదాః

"మరల హాఫిజ్ మరల మధుపాత్ర మధుపాత్ర
మరి మరి ప్రియాన నాన్వేష ణోత్సవ యాత్ర
ఏనాడొ ఏవింత సీమలోనొ తొలంగు
నీ క్షమా దృఢహస్తములనే సఖి, మునుంగు!"

అని. ఈ సూఫీలలో గొప్ప భక్తులూ, మహాకవులూ ఉన్నారు. అయితే ఎట్టి మత మైనా క్రమంగా గడ్డకట్టుకు పోతుంది. వట్టి ఆచారాలకు కట్టుపడిపోతుంది. కపట వ్యాపారాలకు ఆవాసం అవుతుంది. అలాగే సూఫీ సమాజంలో వేషధారులు బయలుదేరారు. తమకు తామే పావనుల మనుకోవడం మొదలు పెట్టారు. ఇట్టి వారిమీద జనానికి గౌరవం ఉండదు. అన్ని అహంకారాలకంటె

సహించరాని అహంకారం నీతికీ, మతానికీ సంబంధించినది. ఖయ్యాముకు ముందే ఇబిన్ సినా అనే ప్రతిభాశాలీ, బహుశాస్త్రవేత్తా, పండితకవీ ఉండేవాడు. ఇతడు ఒక రాత్రి భోగానుభూతితో, ఇంకోరాత్రి విజ్ఞానార్జనంలో గడిపేవాడట. ఇతడే నాటి మత విశ్వాసాలమీద ధ్వజం ఎత్తి, ఎన్నో గ్రంథాలు వ్రాసేడు. ఇతని ప్రభావం ఖయ్యాముమీద ప్రసరించి ఉండవచ్చు. ఖయ్యాము తన కావ్యంలో సూఫీల పరిభాషనూ, సాంకేతికాలనూ ప్రయోగిస్తాడు - ద్రాక్షాసవమూ మొదలైనవాటిని. కాని, కొన్ని రుబాయీలు చదవగానే ద్రాక్షాసవము ద్రాక్షాసవమే గాని సాంకేతికము కాదని మనకు తోస్తుంది.

ఖయ్యాము మతం ఇది : ఈశ్వరుడు ఉన్నాడు. ఆత్మలేదు. కుమ్మరి కుండల్ని చేసినట్లు దేవుడు లోకాన్ని సృష్టిస్తాడు. కుండ పగిలాక మన్నులో కలసిపోతుంది. ప్రాణం పోయాక శరీరం భూమిలో కలసిపోతుంది. ఆ మన్ను మరొక్క దేహం నిర్మించడానికి వినియోగపడుతుంది. ఈ సెలయేటి తోవను మొలిచిన లేత పచ్చికల మీద మోటుగా కాలు ఆనకు. ఇవి ఏ కోమలి శరీర మృత్తిక నుండి చిగురించినవో! ఇక తాను కావించే కార్యాలకు మానవుడు బాధ్యుడు కాడు. దేవుడు శరీరమూ, మనస్సూ కూడా సృష్టించాడు. మన కార్యాలను మనస్సే ప్రేరేపిస్తుంది. ఇక పాపాలు చేశామని దేవుడెలాగ దండిస్తాడు? మనస్సు నెందుకు సృష్టించాడు? కుండ ఓటిదైనా పాత్ర సొట్టపోయినా తప్పెవరిది? సృష్టి కాలబద్ధం. విధి తప్పదు. గతం మరిరాదు. భవిష్యత్తంతా సంశయం. వర్తమానం

అవశ్య భోగ్యం. ఇది వసంతం. ఇది ప్రభాతం. సుమలత కపోలం హిమపాండుర మయింది. మరకతాసనం మీద గులాబి కొలువున్నది. ఇది తియ్యని వేళ. ఈ పచ్చని గరిక తివాసీ మీద వెచ్చని మధురాసవం తాగు. తొందరపడు. మసలదీ ప్రొద్దు. రేపు నీ మీదనే పచ్చని గరిక మొలుస్తుంది. సుమా! స్వర్గమూ లేదు, నరకమూ లేదు. ఆనందం ఇచ్చేవన్నీ స్వర్గంలో ఉంటాయంటారు. వాటిని ఈ లోకంలోనే అనుభవించు. చేజేతా చేసిన పాత్రను నీవే చిన్నాభిన్నం చేస్తావా? దేవుడున్మత్తుడా? తన సృష్టిని తానే ఎందుకు భగ్నం చేస్తాడు? ఉహూఁ, ఈ సందేహానికి నివృత్తి కనపడదు. ఎన్ని చిక్కులో సడల్చవచ్చును. ఎన్ని టక్కులకో లోబడక పోవచ్చును. మరణ రహస్య బంధం విప్పలేక విసిగి పోతావు. అయినా అనుతాపం మాత్రం వద్దు. ఏ నిశీథ సమయాన్నో అనుతాపం రావచ్చు. ఆనంద ప్రభాతం వచ్చి దాన్ని తుత్తునియలు చేసి విసిరి పారేయ్యాలి. పూజలూ, నమాజులూ నీ కష్టాలు పోగొట్టవు. విధి తప్పదు, తప్పదు. అంతే!

నిరాశావాది నంటావేమో? కాదే! సుఖదుఃఖ మేళనం జీవితం. సాధ్యమైనంతవరకు సంతోషాన్నే అనుభవించు. తప్పని మరణానికి తల్లడిల్లకు. తోసుకు వచ్చిన దుఃఖాన్ని ధీరుడవై అనుభవించి పారేయ్. సీజరులూ, సికందరులూ, కైఖుస్రూలు కొంత సుఖించారు. అంతలో మట్టిలో కలసిపోయారు.

ఈ లోకం పాంథశాల. ఉభయ సంధ్యలూ వాకిళ్ళు, ఇక్కడకు ఎందరో వస్తున్నారు. పోతున్నారు. నీవూ అంతే! కనుక ఇదే

ఇరామ్-నంద నారామం. ఇక్కడే కౌసర్ - మధుస్రవంతి, మందాకిని. ఈ గులాబీ పొద పక్క విశ్రమించు ఒక్క రొట్టె, ఒక్క కావ్యము, పక్కన నర్గీస్ పూలవంటి కళ్ళతో, అరుణ వారుణీ పాత్రతో, గాలి కదిలించే జులపాలతో, గులాబీ చెక్కిట పుట్టుమచ్చతో రాగవతి ప్రేయసి , పై నుండి బుల్ బుల్ తాగు తాగు తాగు అని హెచ్చరిస్తుంది. ఈ క్షణం పోనీకు, తాగు అంటే ఏ క్షణాని కా క్షణం హాయిగా జీవితం సాగించు - అంటాడు ఖయ్యాము.

ఖయ్యామును కొందరు ఎపిక్యూర్ అంటారు. కాని ఎపిక్యూరస్ ఖయ్యాముల భావాలలో కొంత తేడా ఉంది. ఎపిక్యూరసే నిరీశ్వరవాది, ఖయ్యాముకాడు. ఎపిక్యూరస్ విధి లేదంటాడు. ఖయ్యాముమన సుఖ దుఃఖాలు విధిచేత నిర్ణయింపబడ్డా యంటాడు. ఒక్క భగవంతుని విషయంలో తప్ప చార్వాక మతానికిన్నీ, ఖయ్యాము మతానికిన్నీ ఏమీ తేడా లేదు.

ఖయ్యాముది రంగు రంగుల మూర్తి. ఆకర్షవంతమైన వ్యక్తిత్వం ఇతనిది. ఇతన్ని గూర్చి ఎన్నో మనోహర మైన గాథలున్నాయి. నిషాపూర్ లో ఒక గొప్ప ఇమామ్ ఉండేవాడు. ఆయన దగ్గర చదువుకున్నవారు అదృష్టవంతులవుతారనుకునేవారు. ఆయన శిష్యుల్లో నిజాముల్ ముల్క్, ఉమర్ ఖయ్యామ్, హసన్ బిన్ సమాన్ - ఈ ముగ్గురూ ఒక్కసారే చదువుకునే వారు. వీరు ముగ్గురూ గట్టి స్నేహితులయ్యారు. ఒకనాడు, హసన్ - ఇమామ్ సాహెబ్ దగ్గర చదువుకొన్నవారు అదృష్టవంతులవుతారు. మన ముగ్గురిలో ఏ ఒక్కరైనా కావచ్చు కదా. అతడు మిగిలిన ఇద్దరినీ

సమానులుగా చేసుకోడానికిఒప్పందం చేసుకొందాం' అని అన్నాడు. కొంతకాలం జరిగింది. నిజాముల్ ముల్క్ బాగ్దాదు సుల్తాన్ వజీరయ్యాడు. ఉమర్ ఖయ్యామ్ ఒకనాడు నిజాముల్ ముల్క్‌ని కలుసుకున్నాడు. వజీరతనిని గౌరవించి, "మీరు చాలా గొప్ప పండితులూ, మేధావంతులూను, మీరేదైనా గొప్ప రాజోద్యోగం చెయ్యాలి. మన షరతు జ్ఞాపకం ఉంది కదా! పాదుషాతో మనవి చేస్తా. మీరూ గొప్ప పదవికి రావచ్చు" అని అన్నాడట. ఖయ్యామిలా బదులు చెప్పాడు : "మీరు గొప్పకులీనులు, కరుణార్ద్ర హృదయులు, తమ కసాధ్యమైన పనిలేదు. మీ శ్రద్ధకు నేను కృతజ్ఞుణ్ణి. నా కొక రొట్టే, ఇన్ని నీళ్ళూ చాలు. విద్యార్థులకు పాఠం చెప్పుకుంటూ గ్రంథ కాలక్షేపం చేసుకుంటా. రాజుల కొలువు నాకు వద్దు. సెలవు ఇప్పించండి. నిజాముల్ ముల్క్ తన స్నేహితుణ్ణి మరీ మరీ కౌగిలించి పన్నెండు వందల తోమానులు ఆదాయం వచ్చే జాగీరును స్వీకరించి అనుగ్రహించమని కోరి అతణ్ణి పంపించాడు.

మరొక గాథ : గ్రహగతులను బట్టి, వాయువర్షాలు ఎలా ఎప్పుడు వస్తాయో తెలుసుకునే శక్తి ఖయ్యాముకు ఉండేదట. మెర్వ్ పాదుషా వేటకు బయలుదేరుతూ వర్షమూ, మంచూ కురవని దినం నిర్ణయించమని ఖబర్ చేశాడట. ఫలానా దినము బాగున్నదని ఖయ్యాము చెప్పేడు. కాని పాదుషా వేటకు బయలు దేరడమేమిటి, ఆకాశం అంతా మబ్బులు క్రమ్ముకుని మంచు కురవడమేమిటి! నలుగురూ ఎగతాళి చేశారు. పాదుషా వేట

మానుకుందాం అనుకున్నాడు. ఖయ్యాము, "ఏం భయం లేదు. బయలు దేరండి. మబ్బును చెదరగొట్టే గాలి రాబోతూ ఉంది. అయిదు రోజులు దాకా నేల తడైనా కాదు" అన్నాట్ట. పై కథల్లో ఒకటి అతని స్వాతంత్ర్యాసక్తి రెండవది అతని శాస్త్రవేత్తృత్వం తెలియపరుస్తాయి. అతని జ్ఞాపకశక్తి కూడా గొప్పది.

ఇస్ఫహాన్ మకాములో ఉండగా ఒక గ్రంథం ఏడుసార్లు చదివి నిషాపూర్‌కు వచ్చాక, ఆ పెద్ద గ్రంథం యావత్తూ తిరిగి నకలుగా వ్రాసేశాట్ట. ఇక మనకు ప్రియుడైన ఖయ్యాము మూర్తి ఎదురుగా పెట్టే గాథ ఒకటున్నది. పూర్వాచార పరాయణుడు కాడని, ఇస్లాం మతాచారాలకు దూరుడనీ ఖయ్యామును గూర్చి ఒక వదంతి ప్రజలలో వ్యాపించి ఉన్నది. శత్రువులు తన ప్రాణాలెప్పుడు తీస్తారో అని మక్కాయాత్ర చేస్తాడు ఖయ్యామ్. చేసి తిరిగి వచ్చి ఇలా అంటాడు :

"కలపయు మట్టి రాల నిడి కట్టిన దేవళమందు నీకు ఏ
ఫలము లభించు? ప్రేమరసభావ యుతుండవ యేని కామినిన్
వలపుము, ప్రాణహీన మగు బండలు వేయిటికన్న శ్రేష్ఠమై
అలరు గదా మనుష్యహృదయంబు ప్రతిప్రణయానురక్తులన్."

–రేడియో ప్రసంగం, 24-4-1955.

* * *

# చిత్తరంజన్ దాస్

మనిషి కృతఘ్నుడు అనను; అయితే మనిషికి మరుపు మాత్రం ఎక్కువ అంటాను. లేకపోతే అదే పనిగా యీ స్మరణ సభలూ, పదేపదే యీ స్మృతి చిహ్నాలూ దేనికి ? మరిచిపోయిన వాళ్ళను జ్ఞాపకం చేసుకుందుకు. అంతేకాదూ! బాగా ఆప్తులుంటారే, బొత్తిగా గుండెలకు పెనవేసుకుపోయినవాళ్లు. వాళ్ళని తప్పిస్తే కనుచూపు దాటి పోయినవాళ్ళందరూ మనస్సులో గూడా మాసిపోతారు. ఒక్కొక్క తరుణంలో, దేశంలో ప్రతీ వాణ్ణీ తుఫాను లాగ ఊపివారేసే ప్రబలు డుంటాడు. వాడి పేరూ, వాడి కథలూ జనాన్ని పిచ్చెత్తిస్తాయి. అతగాడు లోకరంగంనుంచి అదృశ్యుడవుతా డనుకోను. ఇహ క్రమక్రమంగా అతని మూర్తీ, అతని చరిత్రా, దూరంగా వెళ్ళినకొద్దీ అస్పష్టమై పోయి, ఆకాశంలో కలిసిపోయే కొండలా గైపోతాయి. తరువాత అప్పుడప్పుడు స్మృతి సభల్లోనూ, సమ కాలికుల నెమరువేతల్లోనూ బయట పడుతూంటాడు – అంతే !

పాపం, కొన్ని రంగాల్లో పనిచేసినవాళ్ళు మన మనస్సుల్లో మరీ త్వరగా చెరిగిపోతారు. అయితే, దేశ చరిత్రను దిద్దినవాళ్ళూ, దేశ భాగ్యాన్ని నిర్మించిన వాళ్లూ కొందరు అంతగా తుడిచిపెట్టుకుని పోరు. చిత్తరంజన్ దాస్ నిలిచిపోయే రకం !

30 ఏళ్ళ క్రితం - అంటే - మనం స్వాతంత్ర్యోద్యమ మంటామే, అది ముమ్మరంగా ఉన్న రోజుల్లో కొందరి పేర్లు ప్రతి భారతీయుడూ మంత్ర ముచ్చరించినట్లనేవాడు. లాల్ బాల్ పాల్ అనేవారు. సురేంద్రనాథ్ బెనర్జీ అనేవాడు. అంటూంటే కళ్లు ధగధగ మనేవి. వింటూంటే ఒళ్లు జలజలమనేది. తరువాత అలాగే ఆలీ సోదరులూ, మోతీలాల్ నెహ్రూ, పటేల్ సోదరులూ ఇక్కడ ప్రకాశం, వేంకటప్పయ్య పంతులూ దేశాన్ని ఆవేశ పరచే వారు. ఇలాంటి జగజెట్టుల్లో గూడా ముందుకు తోసుకొచ్చి నిలబడ్డ వాడు చిత్తరంజన్ దాస్.

19 వ శతాబ్దిలో పుట్టిన ప్రముఖులు అదో రకం పెద్ద తరహోవాళ్ళు. వీళ్లల్లో ఒక ఔన్నత్యమూ, గాంభీర్యమూ ఉండేవి. అంటే అందరూ గూడా ఓ పెద్ద కొండలా గుండేవారేమో - పెద్ద యెత్తైన శిలా విగ్రహంలాగ. ఉహుం. అది కాదు నా అభిప్రాయం. పెద్దతరహా అంటే కొందరు మహాపురుషులు సరస్సుల్లా గుంటారు మన పక్కనే, మన కందుబాటులో కదలకుండా చల్లనినీరూ, అవీ యిస్తూ - మనకి తెలిసిపోతూ, మరికొందరు నదుల్లా గుంటారు. వీళ్లూ ప్రక్కనే ఉంటారు. అందుబాటులో ఉంటారు. వీళ్లూ చల్లని నీరూ అవీ యిస్తారు. అయితే ఎక్కడి నుంచి

వచ్చారో, ఎక్కడికి వెడుతున్నారో తెలియనీయకుండా ఉంటారు. కొందరు పువ్వులతో, పళ్లతో, నలువైపులా చాపుకున్న చేతులతో పెద్ద చెట్లలా ఉంటారు. సరే, కొందరు పర్వతంలాంటి వాళ్లూ ఉంటారు. అయితే, ఇందాకా చెప్పినట్టు 19 వ శతాబ్ది వాళ్లందరి లోనూ ఓ పెద్దతనం ఉండేదీ అంటే చెరువైతే పెద్ద కాసారంలాగా, చెట్టయితే పెద్ద వటవృక్షంలాగా నున్నూ ఉండేవాళ్లన్నమాట. వాళ్లు జైంట్స్ అనిపించేది. వాళ్లేదో ఉద్దేశంతో బతికినట్టుండేవాళ్లు. వాళ్ల ప్రయాణానికి గమ్యస్థానం ఉండే దనిపించేది. అక్కడికి పనిగట్టుకుని మార్గం దిద్దుకునే వాళ్లు, వాళ్లు అక్కడికి వెళ్లేదాకా కావలసిన దారి బత్తెమంతా ఓ సంచీలో కూడబెట్టు కున్నట్టుండే వాళ్లు. ఇలాంటి కొన్ని గుణాల్లో వాళ్లు మనకన్నాదిట్టలేమో మరి! చిన్నదో, పెద్దదో, వాళ్లు జీవితాన్ని ఒక యిల్లులాగ కట్టుకునే వాళ్లు. జిప్సీస్ లాగ డేరాల్లో ఉండేటట్టుండేది కాదు వాళ్ల జీవితం ఇక్కడ నుంచి అక్కడకు, అక్కడనుంచి ఎక్కడికో పోతూ.

చిత్తరంజన్ 19 వ శతాబ్ది దిట్టల్లో కల్లా దిట్ట. ఈయన బెంగాల్ లో పుట్టాడు 1870 లో. 1925 లో పోయాడు. ఆనాటి పెద్దల్లో ఇంత త్వరగా ఎవరూ వెళ్ళిపోలేదు. పాపం, ఏభైయ్యె దేళ్ళేగా ఆయన జీవించింది ! 1923 లో కాకినాడలో జాతీయ మహాసభ జరిగినప్పుడు వచ్చాడు - ఒక స్పెషల్ టెయిన్ లో, కొన్ని వందలు పరివారంతో - అంతవరకూ అమలులో ఉన్న కాంగ్రెస్ కార్యపథకాన్ని మార్చడానికి. రెండో పక్షంలోనూ ఉద్దోలులున్నారు. అయితే చూసిన వాళ్ళ కీయన నెలా కనబడ్డాడంటే - ఇందాకా

చెప్పానే - ఆ పర్వతంలాగ, కావలసింది సాధించి తీరే ప్రభువులాగ, దారిలో వచ్చే ముళ్ళూ, గోతులూ, రాళ్ళూ, చీకట్లూ, గోడలూ అన్నీ తొక్కుకు పోయేవాడిలాగ. ఆ ప్రాభవం కొట్టొచ్చినట్టగుపించింది మా బోటి యువకులకు. మహా అభిమానిలాగ కనబడ్డాడు మాకు. ఏమి గర్వం, ఏమి ఠీవి - అనుకున్నాం. అంతవరకూ సాగిన ఆయన చరిత్ర తెలుసుకున్న దాకా తోచింది కాదు. అప్పుడు విన్నాం - ఏమని ?

ఈయన తండ్రి కలకత్తాలో ప్రముఖ న్యాయవాదిగా ఉండేవాడనీ, ఈయన గూడా బారిస్టర్ పాసయ్యాడనీ, ఇష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టడం వల్లా, కారణాంతరాలవల్లా తండ్రిగారు అప్పులపాలైతే తానూ తండ్రీ ఇన్‌సాల్వెంట్స్ అయారనీ, తరవాత తాను లక్షలార్జించడం మొదలుపెట్టాక వెనకటి అప్పు లన్నీ - అవి తీర్చనక్కర లేకపోయినా ఈ అభిమాని తీర్చిపారేశాడనీ, అప్పుడు దేశం యావత్తూ ఆశ్చర్యచకితం అయిపోయిందనిన్నీ, తరవాత ఆలీపూర్ కేస్‌లో శ్రీ అరవింద మొదలైన ముద్దాయీలకు న్యాయవాదిగా ఉండి తన ప్రతిభ ప్రకటించా డనిన్నీ. దానితో మరీ గొప్ప లాయరై మరీ కొల్లలుగా గడిస్తూ అనేక సంస్థలకు, విద్యార్థులకు, కష్టజీవులకు ఆ ఆర్జన యావత్తూ కుడి, యెడమ చేతులతో పంచిపెట్టి పారవేసేవాడనిన్నీ, ఆయన ఇల్లొక పెద్ద సత్ర మనీ, ఆయన వంగ ప్రజకు ప్రియతముడనిన్నీ, ఆయన కాంగ్రెస్ సభల్లో మొదట మహాత్ముని అసహాయోద్యమాన్ని వ్యతిరేకించా డనిన్నీ, క్రమక్రమంగా దానిని స్వీకరించి తానూ, తన భార్యా,

చెల్లెలూ, ఒక కొడుకూ అందరూ జైలుకి వెళ్లారనిన్నీ, ఇంకా ఎన్నో ఎన్నో ఇలాంటి గాథలు విన్నాం అప్పుడు. "చిత్తరంజన దాసు, చిన్నారి కొడుకునీ - చెయి విరిచి చెరబెట్టినారూ" అని గూడా పాడాం, మేమప్పుడు చిత్తరంజన్ దాస్ వీరుడు అనుకున్నాం. త్యాగులందరూ వీరులు కారు నిజానికి.

ఇందాకా అనుకున్నాం గదా, గొప్పవాళ్లలో రకరకా లుంటారని- సాధుసత్తములు, ఉత్తములు - మన దేశభక్త వేంకటప్పయ్యగారిలాగ, కార్యచతురులు - వల్లభాయి పటేల్ లాగ, మేధావులు - లోకమాన్యుని లాగ, ఇలాగ ఇలాగ రక రకాలు. చిత్తరంజన్ దాస్ వీరుడు. వీరుడికి ముందు వెనక లెంచుకోవడం, కేలుక్యులేషన్, తటపటాయించడం ఉండదు. సమర వీరుడు, దాన వీరుడు, ధర్మవీరుడు - ఎవడైనా అంతే! ఎదిరి బలం, తన బలం ఎంచుకోవడం ఉండదు. పోరాడ వలసిందే, గెలిచితీర వలసిందే. తన కలిమీ, తన భావీ తూచుకోవడం ఉండదు. ఇచ్చిపారేయవలసిందే. ఈ వీరుడికి యుద్ధం చేయడం సహజగుణం. వీనికి ఈవి పువ్వునకు తావి. అంతే! ఒక్కొక్క దాత ఉంటాడు. ఇస్తాడు. అడిగిన దంతా గూడా ఇవ్వొచ్చు. అయితే ఆ ఈవికి వెనక కాస్త కీర్తికామమో, రవ్వంత మోక్షదృష్టో ఉండొచ్చు. ఆ ఈవికి వెనక తన భావికోసం ఒడుపు గూడా ఉండొచ్చు. వీళ్లు ఎట్టి దాతలైనా కావచ్చు - దానవీరులు కారు. వీళ్ళకి లోక మెంతైనా ఋణపడి ఉండొచ్చు - వీళ్ళ గాథలు కావ్యాలు కాలేవు. చిత్తరంజన్ దాస్ దానవీరుడు!

తరవాత 1925 లో మరి మూడునెల్లకు చనిపోతా డనగా మిగిలిన ఆస్తి యావత్తూ – కోట్లు గడించిన వాని కది బహుకొద్ది – దేశానికిచ్చేశాడు. నూరేళ్లు జీవించవలసినవాడు 55 ఏళ్లే జీవించి, నలిగి, చితికి ప్రాణమే ఇచ్చేశాడు దేశానికి – అంతే! అదీ అతని ధోరణి!

చిత్తరంజన్ ని గూర్చి ఇలా చెప్పుకోవలసిన వెన్నో ఉన్నాయి– కాంగ్రెస్ ప్రెసిడెంట్ కావడం, ఆంగ్లేయుల్ని హడలెత్తించడం ఇలాగే ఎన్నెన్నో.

చిత్తరంజన్ మహా వక్త. మొదట న్యాయస్థానాల్లోనే ఈయన వాగ్ధాటి అప్రతిహతంగా ఉండేది. తరవాత రాజకీయ సభల్లో ఆ కంఠస్వరం, ఆ వాణి జనాన్ని ఊగించేసేది. గయా కాంగ్రెస్ అధ్యక్షపీఠం నుంచి ఆయన చేసిన ప్రసంగంలో తుది వాక్కులు. ఆయనవే వినిపించాలని ఉంది – ఎలాగ!

"నీది ధర్మసమరం సుమా. నీవు సాధించే విజయం సామాన్యమయింది కాదు. నిన్ను నీచ పరచేది కాదా విజయం. దానివల్ల లభించే ప్రాభవం నీ హస్తాల్లోనే గుప్తపరచుకో లేవు. నీది ధర్మసమరమైతే నీ అస్త్రాలు గూడా ధర్మయోధునికి ఉచితమైనవి. నీ క్రాగ్రహం పనికి రాదు. ద్వేషం పనికి రాదు. నైచ్యం, అల్పత్వం, అసత్యం నీ దగ్గరకే రాగూడదు. ఉషస్సులో తొంగిచూసే ఆశ నీది. ప్రభాతంలో భాసించే విశ్వాసం నీది".

"ఆ గ్రీక్ గాథలో వస్తాడే టైటాన్ – మానవుడికోసం బంధితుడైన వాడు, వాడి కంఠరవం వినిపించిన ఆ గేయం – అది నువ్వు గూడా పాడు! ఏమనీ ?

ఆశ కూ్కాడా అతీతమైన కష్టాలను పడ్డం,
రాతిరికన్నా మృత్యువుకన్నా నల్లనైన అన్యాయాలను
క్షమించడం,
ఎదిరించడానికి గూడా వీలులేనట్టు కనబడే శక్తిని
తృణీకరించడం,
ప్రేమించడం – ఓర్మితో సహించడం,
శైథిల్యం నుండి జర నుండి నవ జీవనాన్ని సృష్టించుకోవడం–
చలించకపోవడం – నీ మార్గం నుండి తప్పుకొనకపోవడం,
నీరస పశ్చాత్తాపంతో క్రుంగకపోవడం –
ఇవి – ఇవన్నీ కలిపి – ఇదీ ధర్మ మంటే –
ఇదీ గొప్పగా బ్రతకడ మంటే –
ఇదీ ఆనంద మంటే – సౌందర్య మంటే –
నిర్భయ స్వచ్ఛంద జీవిత మంటే ఇది –
ఇదే జీవితం – ఇదే సామ్రాజ్యం – ఇదే విజయం!"

విన్నారా ? కొంతయినా స్ఫురించిందా చిత్తరంజన్ ప్రసంగ ధోరణి ? అయ్యయ్యో, ఆయన మాటలే వినిపిస్తే బాగుండు ననిపిస్తుంది నాకు.

చిత్తరంజన్ మంచి కవి. ఈయన కావ్యాలు వంగభాషలోనే వ్రాసేడు. ఈయన 'సాగర సంగీత' మనే కావ్యాన్ని మాత్రం శ్రీ అరవిందులు ఆంగ్లంలోకి అనువదించారు. చిత్తరంజన్ సాహిత్య

లోకంలో అడుగు పెట్టే సరికే రవీంద్రుని ప్రభావం వంగకవులపై ఎంతేనా ఉంది. మొదట చిత్తరంజన్‌పై గూడా అది ప్రసరించింది. సంస్కృత సాహిత్యం, మధ్యయుగపు వైష్ణవ గీతాలూ, సూఫీ రచనలూ, ఆంగ్ల కావ్యాలూ వీటన్నిటి పలుకుబడీ నాటి వంగ రచయితలపై తీవ్రంగా ఉండేది. చిత్తరంజన్ నెమ్మదిగా ఆ ధోరణి వదులుకున్నాడు, పూర్వ వంగకవుల ధోరణికి - చండీ దాస్, విద్యాపతుల మార్గానికి తన పద్ధతి తిప్పుకున్నాడు. నాటి రవీంద్రుని ప్రభావం నుండి ఒక పట్టాన బయట పడ్డం కష్టం. అయినా చిత్తరంజన్ అలా చేసి నెగ్గాడు.

"ఇతన్ని వంగకవుల ప్రథమశ్రేణిలో నిలబెట్టలేం. ఇతడు కొత్త కావ్య వస్తువులను ఎన్నుకోలేదు.కొత్త ఛందో మార్గాలను తొక్కలేదు. కొత్త సందేశాలు ఇవ్వలేదు. వ్రాసింది తక్కువ కూడా!" అని కొందరు విమర్శకులు అనవచ్చుగాని - అతని కావ్యాలన్నిటిలోనూ మనోహరమూ, సుకుమారమూ అయిన పరిమళం ఒకటుందనిన్నీ, అమరులైన వంగ కవుల్లో అతడొక డనిన్నీ విజ్ఞులంటారు.

ఇతని మొదటి కావ్యం 'మాలాంఛ' - అంటే ఆరామం. భావ కావ్యాల సంపుటి. సౌందర్యమంటే మహాయిష్టం. జీవిత మంటే పట్టపగ్గాలు లేని ఆసక్తి. సుఖదుఃఖాల లోతులు అందుకోవాలనే కాంక్షా, ఇటువంటివి ఈ ఆరామంలోని ఖండకావ్యాలలో స్ఫురిస్తాయి. వీటిలో శాంతీ, చల్లదనం తక్కువ.

తరవాత - 'లైఫ్ ఆఫ్ ఏ హార్‌లట్' - 'కులటా జీవితం' అని మరో కావ్య సంపుటి. ప్రతిఫలం దొరకని ప్రేమ, చితికి పోయిన

ఆశ, వీటి మీద కవి మనస్సెక్కువ పరుగెత్తే దారోజుల్లో. సృష్టిలో కనబడే అన్యాయాలూ, విప్పలేని రహస్యాలూ, ముడులూ ఈ కవి హృదయాన్నప్పుడు నలిపేసినట్టు కనిపిస్తుంది.

"ది స్ట్రికెన్ సోల్ లేస్ డౌన్ ఇట్స్ బర్డెన్ ఎట్ దై ఫీట్ ఓ మెర్సీ ఇన్‌ఫినిట్" అంటాడు. భగవంతుణ్ణంటాడూ, "నువ్వు మూగవు - పిలిస్తే, ప్రశ్నిస్తే జవాబు చెప్పవు" అని. ఇంకా తిక్కగా, అంటాడు "నీతో నాకు పని లే" దని.

కులటని గూర్చి వ్రాస్తూ - ఆమె అవమానం లోకానికి హాయి, ఆమె బాధ లోకానికి ఆనందం - అని ఆగ్రహిస్తాడు.

మరికొంత కాలానికి 'మాల' అనే కావ్యసంపుటి ప్రకటించాడు. దీనిలో ఆ తిక్క కనబడదు - ఆ ఎదిరించడం, ఆ అశాంతిన్నీ. ఉదాత్తమైన ఆవేశాలుంటాయి దీంట్లో. భగవంతుడు ప్రేమమూర్తిగా సాక్షాత్కరిస్తాడిక్కడ కవికి. ఆ దివ్యస్పర్శ తగిలితే తన ఇంద్రియాలు వివశమైపోయి ఊగిపోతాయంటాడు. తన అంతరంగ ద్వారం తెరిచానంటాడు. రమ్మంటాడు ప్రభువుని. తానే స్వామి అడుగులకింద తివాచీనైపోతానంటాడు. ఒక్కొక్కప్పుడు చీకటిలో నడిచిపోయే బాటసారి అనిన్నీ, తన కోసం దూర దూరాన గవాక్షంలో దీపం వెలిగించి ఏదో అదృశ్యహస్తం పెట్టిం దనిన్నీ అంటాడు. పర్వత శిఖరం మీదా, తరుల తల మీదా, సూర్యోదయానికి ముందు నీరవ గగనాంకం మీదా పవ్వళించే ఆ ఉదార శాంతి తనకు కావాలంటాడు.

తరువాత వచ్చిన 'అంతర్యామి' అనే కావ్యసంపుటిలో గూడా ఇదే ధోరణి.

ఆఖరుది 'సాగర సంగీతం'. దీనిలో నిశాదివసాలలో, వెలుగు నీడలలో ఎప్పటికప్పుడు మారిపోయే సముద్రమూ, ఆ మార్పులతో కవి చిత్త వృత్తులు గూడా మారడం – కవికీ కడలికీ ఉన్న బాంధవ్యం కడలిని చూసి కవి మనస్సు మారుతూంటే కవి మనస్సున కనుకూలంగా కడలి దర్శన మిస్తూండడం, ఉషః కాలంలోనూ, ప్రభాతవేళలో సముద్రం, పండు పున్నమి నాటి పయోధి, సందె వేళలసాగరం, మునిమాపు ముసిరేటప్పుడూ, రాతిరి నిద్దర పోయేటప్పుడూ తానూ, అపార పారావారమూ ఒకరి వైపు ఒకరు అచంచల నేత్రాలు త్రిప్పుకొని చూసుకోవడం, మెత్తని గాలి వ్రేళుల చక్కిలిగింతలు తట్టుకోలేక అంత జలరాశీ అలలు అలలుగా విరిగి విరిగి కిలకిలా నవ్వడం – దూరాన క్షితిజరేఖ వద్ద మేఘాలు సముద్ర స్నానానికి క్రిందికి దిగడం – క్రుద్ధ ప్రభంజనం పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ సముద్రం మీద నడవడం – ఉద్ధత తరంగాలు నురుగు జూ లూగిస్తూ ఎగిరిపడ్డం – తరవాత సముద్రం మీద పొడుగాటి నీడలు పాకడం – ఇటువంటి ఎన్నో ఎన్నో చిత్రాలతో ఈ కావ్యాలలో వేద కాలం నాటి ఉద్గాతల శక్తీ, హెూమర్ నాటి గ్రీక్ కవుల ప్రజ్ఞా కొంతవరకు స్ఫురిస్తాయని ఒక రసజ్ఞుడైన విజ్ఞుడంటాడు.

దేశ భక్తుడైన చిత్తరంజన్ దాసును లోకం క్రమక్రమంగా మరచిపోవచ్చునేమో కాని–చిత్తరంజన్ కవిని మరచిపోలేదు.

– రేడియో ప్రసంగం, 5-11-1959.

* * *

# ప్రకాశం

[‘నా జీవితయాత్ర’ సమీక్ష – ‘శిల్పి’లో ప్రచురితం – 1946]

ప్రస్తుతం ప్రకాశం మకాం మద్రాసు గవర్నరు భవనంలో. భక్తులైన పూజారులకు గాని స్వామి గర్భాలయం తలుపులు ఇది వరకు సడలేవి కావు.

ఇప్పుడు ముఖ ద్వారం తలుపులు మూత పడడమే మాని వేశాయి. ఎప్పుడూ వచ్చే ప్రజా, వెళ్లే ప్రజానూ! తీర్థం !

వారిలో కాసూరి రంగడు, అలీబేగ్, అద్దేపల్లి అప్పడు, మస్తాన్, ‘కింగ్ ఆఫ్ ఒంగోల్’ నవులూరి రమణయ్య, రాజమహేంద్రవరం బెస్తలూ కూడా ఉన్నారా! అనిపిస్తుంది.

ఎందుకు ఉండగూడదు ?

వీళ్లెవరో తెలుసునా! వీళ్లందరూ ప్రకాశం బాల్యంలో స్నేహితులు.

డెబ్భై యేళ్ళ క్రితం, నాయుడుపేటలో సువర్ణముఖి ఒడ్డున వేంచేసి ఉన్న శ్రీ ఆంజనేయస్వాముల కారగింపుగా కోడిగుడ్లు నైవేద్యం పెట్టిన బాల భాగవతుడు కాసూరి రంగడు.

అక్కడ తోటల్లో విడిది చేసిన వెంకటగిరి మహారాజుల ఏనుగులమీద ఎక్కడానికి మావటి వానికి కానీయో, అర్ధణాయో

కానుక ఇచ్చి, గజారోహణ భాగ్యం పదేండ్ల ప్రాయంలోనే పొందిన నవాబ్ ఆలీబేగ్ బహద్దరు.

బొంగరాలూ, గోళీలూ కొనడానికి దొంగతనాలు అవసరమై, చిన్న ముఠాలు చేరదీసి ఒంగోలు నడిబజారు వీథుల్లో చిల్లర దుకాణదారుల గల్లా పెట్టెల బరువు వదిలించే మేటి సర్దారు అద్దేపల్లి అప్పడు.

అందరి కన్నా అసాధ్యుడు నవులూరి రమణయ్య. ఇతని 'ఊట్' కంపెనీలో మస్తాన్ సాహేబ్ వంటి మహా సాహసికులు ఉండేవారు; రంగారాయుడు చెరువుకింద వరిగె పంటను రాత్రి రాత్రీ కోయించి, నెత్తిని పెట్టించి పొలం దాటించిన పోటర్లు!

ఇలాంటి వారితో అప్పుడు ప్రకాశానికి జట్టు!

కనుక ఇప్పుడు వాళ్లంటే - ఎప్పుడూ వాళ్లా ఉంటూనే ఉంటారు - వాళ్లది కూడా డెబ్బై అయిదో పుట్టిన రోజు ఈ ఏడాదికి ఇటో అటో పడి ఉండేదేమో !

అయినా - మొన్న ప్రధానమంత్రి[1] జన్మదినోత్సవం జరిగినప్పుడు వాళ్లందరి పుట్టిన రోజుల పండుగలూ జరిగినట్లే!

ప్రకాశం వట్టి ప్రజ!

ప్రభువుల్లో కంటె ప్రజల్లోనే ఉదాత్తత ఎక్కువ ఉందంటాను. సామాన్యున కున్న దర్జా సామంతునకే లేదు.

---

1. అప్పుడు కాంపోజిట్ మదరాసు స్టేట్‌లో ముఖ్యమంత్రిని ప్రధాన మంత్రిగా వ్యవహరించేవారు.

గద్దెమీదా, గరికె నేల మీదా ఒకే ఠీవితో కూర్చోగలిగిన వాడిదే హుందా.

వాడికి ఒక కనకపు సింహాసనం గౌరవం ఇవ్వనక్కర్లేదు.

పంచ టరుగును పట్టపు తఖ్తు చెయ్యగలవాడు వాడు.

సామాన్య ప్రజ సహజంగా రాజు; కొందరు దోపిడి వల్లా, దుస్తంత్రాల వల్లా, ముళ్ళు వేసీ, కాళ్ళు పట్టుకునీ, దొంగతనం వల్లా దొర లౌతారు.

ప్రకృతి సిద్ధంగా దర్జా అయినవాడు ప్రకాశం.

ఇతన్ని 'ప్రకాశం గారు' అనలేము. అలాగ అంటే ఆప్తత పోతుంది. నన్ను నేను 'గారు' అనుకున్నంత నవ్వులాటగా, దుస్సహంగా ఉంటుంది.

ప్రకాశం పంతులు అని కూడా అనలేము.

మతం లేదు, కులం లేదు. మస్తానుకీ, బెస్తకీ నేస్తం 'పంతు' లెలాగవుతాడు ?

పంతుళ్లు వేరు. వారూ ప్రముఖులూ, గొప్పవారే. న్యాపతి సుబ్బారావు పంతులు, మోచర్ల రామచంద్రరావు పంతులు! వారికి 'పంతులు' అనేది నప్పుతుంది; బిరుదూ ఒప్పుతుంది. సామాన్యులా ?

'పంతులు' గాని, బిరుదుగాని తగిలించకుండానే 'ప్రకాశం' అన్న పేరులో కావలసినంత బరువూ, ప్రతిష్ఠా ఉన్నాయి. అందులోనే ఉన్నాయి కూడా మన ప్రధానమంత్రి పలుకుబడీ, ప్రభావమూను.

ప్రకాశం మూడు కోట్ల జనం పేరు.

ప్రకాశం అంటే 1921 తరవాత వచ్చిన ప్రజా జాతీ యోద్యమానికి ప్రబల చిహ్నం అన్నమాట. మన రాష్ట్రంలో ఆ ఉద్యమ చైతన్యం అంతా అతనిలో ఇమడి ఉంది. అతని మూర్తి (Personality) లో మనకు ఆ ప్రజాశక్తి స్ఫురిస్తుంది.

ఆ ఉద్యమాన్ని గూర్చి ఇక్కడ ఒక్కమాట:

1921 కి పూర్వం, జాతీ యోద్యమంలో విద్వాంసులూ, అధికారులూ, మేధావులూ ప్రసంగా లిచ్చీ, పత్రికలకు వ్రాసీ కృషిచేస్తూ ఉండేవారు.

ఇక నలభై కోట్ల ప్రజ మాత్రం నిదానంగా నిద్రలాంటి మగతలో పురాణ స్మృతులు నెమరువేసుకుంటూ ఉండేది. ఆ నీరస స్థితికీ, నిర్వీర్యానికీ సిగ్గుపడడం కూడా ఆ ప్రజకు తెలియదు. మానం లేదు; అభిమానం లేదు. తృష్ణ లేదు, ఆత్మవిశ్వాసం లేదు. తన నీడ తన్నే తరుముతుంటే తల్లడిల్లి పోయేది.

అప్పుడు భారత రంగంలోకి గాంధీ అవతరించాడు.

ఈయన చిత్రమైన వాడు.

ఈయన్ని మించిన మహా మేధావులు వర్తమాన భారతంలో ఉన్నారు. ఈయన కన్న విద్యాసంపత్తీ, అర్థబలమూ, శరీర సౌష్ఠవమూ, రాజకీయ విజ్ఞానమూ, కళావైభవమూ ఉన్నవారు, హిమాలయ శిఖరాల వంటి వారు ఎందరో నేటి భారత వర్షంలో సాక్షాత్కరిస్తారు.

అయితే, దవ్వు దవ్వులనే నిలబడి వారిని గౌరవిస్తుంటాము.

వారిలో ఒక్కొక్కరిలో ఉన్న ఒక ప్రత్యేక శక్తి ముందు మన

కించుదనం – తక్కువ తనం – నిలబడితే వాళ్లు మనకి అందరాని ఎవరెస్టులు అయిపోతున్నారు. వాళ్ల గొప్పతనం సామాన్యులమైన మన కొద్దితనం చూపిస్తుందే కాని, ఆశా బలం గాని, ఆత్మవిశ్వాసం గాని, అహంకారం గాని, గర్వం కాని ఇవ్వలేదు.

ఇక గాంధీ మాహాత్మ్యం ప్రత్యేక ప్రతిభలో లేదు.

ఈయన మన కళ్లు మిరుమిట్లు గొలపడు.

ఈయన కైలాస శిఖరం కాడు.

దేశం అంత జలాశయం గాంధీ.

గాంధీ గంగానది.

దానిలో అమృతం మీకూ, నాకూ – అందరికీ అహ రహమూ అన్ని పనులకూ అందుబాటులో ఉంటుంది.

ఈయన శక్తులు మనకూ ఉండవచ్చుననిపిస్తుంది.

ఈయన కట్టూ, బట్టా మనలో అందరికన్నా సామాన్యుని కట్టూ, బట్టా స్ఫురింప జేస్తాయి.

ఈయన కుటీర వాసమూ అలాగే!

ఈయన ఉపవాసాదులూ అలాగే!

కనుక తన వంటివాడే ఒకడు నలభై కోట్ల మందికి నాయకుడైనప్పుడు, 'రాజమాన్య రాజ పూజితు' డైనప్పుడు, ఆ నలభై కోట్లలో ప్రతి దరిద్రుడూ తాను కూడా నాయకుడైనట్లే గర్వపడడం ప్రారంభించాడు.

గాంధీ వైస్రాయిని చూసినప్పుడు, ప్రతి కుగ్రామంలోనూ ప్రతి కాంగ్రెసు వాలంటీరూ, ప్రతి మనిషీ వైస్రాయి తనతోనే

సంప్రదింపులకు వేంచేసినట్లు అనుకోవడం మొదలు పెట్టాడు.

'నా వంటి వాడు అంతవాడైనప్పుడు నే నెందుకు కాకూడదు?' అన్న ఆశావాదమూ, ఆత్మవిశ్వాసమూ, బడాయీ, ప్రాభవమూ మొదటిసారి వానిలో విజృంభించాయి.

1921 తో నలభై కోట్ల బొరియల్లో ఉన్న పురుగులు నలభై కోట్ల మానవులయ్యాయి.

మరి నలభై కోట్ల మానవులు సముద్రంలాగ పొంగి వస్తూంటే ఎందరు 'కాన్యూట్లు' (Canutes) దానికి అవధులూ, అడ్డుకట్టలూ కట్టగలరు ?

ఈ దృష్టితో చూస్తే ఆచార్యులూ, పండితులూ, భాష్యకారులూ, ప్రభువులూ – వీళ్లు మాత్రమే గాంధీ శిష్యులు కారు.

సూక్ష్మంగా చూస్తే గాంధీ అనుచరులు ఒక్క కాంగ్రెస్ వాదులు మాత్రమే కూడా కాదు. కాంగ్రెస్‌వారూ, కమ్యూనిస్టులూ, అన్ని రాజకీయ పక్షాలవారూ– ఖద్దరు కట్టినవారూ, కట్టనివారూ, అహింస అనే వారూ, అననివారూ, హరిజనోద్ధరణకు భుజా లొగ్గేవారూ, ఒగ్గనివారూ – అందరూ ఆయన అనుచరులే! అంటే అనిబద్ధమైన అశేష భారత ప్రజానూ గాంధీ సంతతే! గాంధీ నేటి భారతదేశానికి బాపూ!

1921 తో మన రాష్ట్రంలో కూడా ఒక్కసారి ఒళ్లు విరుచుకుని హుమ్మని లేచిన జన సామాన్యానికి ఉన్న గుణాలన్నీ ప్రకాశంలో ఉన్నాయి. ఆవేశం, ఉత్సాహం, ఆగ్రహం, అనుగ్రహం, ఔదార్యం, అసూయ, పట్టుదల, మొండితనం, సాహసం, తిక్క – అన్నీను.

అన్నింటికీ అడుగున అంతర్వాహినిగా సహజమైన ఒక బుద్ధి సూక్ష్మత కూడా ఉంది.

ఈ గుణాల కలయిక అతన్ని అప్రతిహత మైన ఒక శక్తిగా చేసింది.

మేధావిగా కనబడే వాని సమక్షంలో మనం కూడా మేలుకుని ఒడుపుగా తిరుగుతాము. అలాగే సజ్జనులుగా కనబడేవారి సన్నిధిలో కూడా. అలాగ కనబడకుండానే తెలివైనవాడే నిజంగా మన్ని లోబరచుకుంటాడు. ప్రకాశం అలాంటి వాడు.

ఈ భావాలన్నీ మొన్న 'నా జీవిత యాత్ర' చదివాక నా మనస్సులో కలిగాయి.

అతని చిన్నతనపు చేతలూ, గాథలుగా అయిపోయిన కొన్ని సంఘటనలూ, ఆ తరవాత 1921 మొదలుకొని మొన్నటి శాసనసభా నాయకత్వపు సందడుల దాకా జరిగిన సంఘటనలూ- అన్నీ మనస్సులోకి పరుగెత్తుకుని వచ్చాయి.

ఒకటి తేలింది. చిన్ననాటి ప్రకాశమే ఇప్పటి ప్రకాశమూను!

కొందరి జీవితాల్లోలాగ ఇతని జీవితంలో అభూతమైన మార్పులూ, వింత విప్లవాలూ వచ్చిపడి ఇతన్ని ఒక కొత్త మనిషినో, వింత మనిషినో చేసి పారెయ్యలేదు. ఇతని బ్రతుకులోని స్వచ్ఛతా, వేడీ పోగొట్టలేదు. పాత గుణాలే జాతి అంత విశాలంగా పెరిగాయి. అంతే!

ఎంత బాగుంది 'నా జీవిత యాత్ర'

యాభై ఏళ్ళ గాథ పందెపు గుర్రంలా పరిగెత్తింది.

ప్రకాశం గొప్ప రచయిత కాడు. 'శిల్పి' కాడు – జవహర్ లాల్ నెహ్రూ లాగ.

నెహ్రూ 'స్వీయ చరిత్ర' గడసరీ, కళావేత్తా, ఉత్తమ సంస్కర్తా రంగులుదిద్ది, రాగాలు పోసి సుందర నిర్మాణంగా తయారు చేసినది. దానిలో ఒక అపూర్వ సంఘటన వచ్చినప్పుడు, ఒక అద్భుత వ్యక్తి అవతరించినపుడు, ఒక తీవ్ర సమస్య ఎదురుకొన్నపుడు గ్రంథకర్త మనస్సు ఎన్ని విధాలుగా ఆలోచించిందో, ఎలాగ పని చేసిందో అన్నీ విపులంగా వివరింపబడ్డాయి !

'నా జీవితయాత్ర' అలాగ కాదు. సంఘటన తరవాత సంఘటన ! సమరం తరవాత సమరం ! ఎటొచ్చీ చిన్నతనంలో చిన్నవీ. పెరిగాక పెద్దవీ. చరిత్రకారుని అభిప్రాయాలు వినం. మన అభిప్రాయాలు ఇవ్వం. సరదాగా చదువుకుంటూ పోతాము.

'Rough, and tough, we are the stuff ! We want
to fight and cannot get enough !'

అన్నట్టు మనకనిపిస్తుంది.

ఒక్కొక్క యాత్రకు గమ్యస్థానం ఉంటుంది. కనుక ఆ యాత్రామార్గం గమ్యస్థానం కోసం తీర్చిదిద్ది నట్లుంటుంది.

మరి ప్రకాశం యాత్రకు గమ్యస్థానం లేదు.

కనుక యాత్ర ఆగిపోవడము లేదు. అలాగ సాగిపోవడమే, అంటే స్వరాజ్య స్థాపనతో ఆగిపోదన్నమాట!

బ్రతికున్న మానవుని యాత్ర ఆగిపోతుందా ? ఆ మార్గం తీర్చిదిద్దినట్లు కాక మలుపులతోనూ, వంపులతోనూ నిండి

ఉంటుంది. ప్రతి మలుపు వెనకాలా ఏదో వింతో, వేడి వేడి పోట్లాటో ఉండి తీరుతుంది. మలుపు లేని మార్గం మనకి బాగుండదు. దానిలో సరదా ఉండదు.

పన్నెలు, చిన్నెలు వేయకుండా 'జీవతయాత్ర' వ్రాయడంవల్ల ఒక విధమైన సొగసూ, ఆకర్షణా లేకపోయినా, కథకు బలమూ, తీవ్రగమనమూ వచ్చాయి.

తనకు అనుకూలమైనవీ, విరుద్ధమైనవీ కూడా విశేషాలన్నీ సమానోత్సాహంతో ఒకటే రుచితో చెబుతాడు.

సందె చీకట్లో కిటికీలో కూర్చున్న ప్రకాశాన్ని యెనమండ్ర కొండయ్య ఊచి పుచ్చుకుని కొడతాడు. పట్టపగలు రాజమహేంద్ర వరంలో తాసిల్దారు కచేరీ దగ్గిర ఆ కొండయ్యనే బండిలో నుంచి పడదోసి చలపతిరావూ, తానూ చావబాది వదుల్తారు.

తన్నూ, తన ముఠానీ పచ్చడి చెయ్యడానికి కాకినాడ నడి వీథిలో సింహంలాగ వచ్చిన సింగితపు అబ్బాయి వీరగాథ భారతంలో నుంచి కత్తిరించిన కథా ఖండంలా గుంటుంది – ఘల్లుమనే బాణాకర్ర, తాడిలాంటి తాడి వెంకటరత్నం ఒక్క దెబ్బతో చిత్తవడం, ఒకే దెబ్బ ఇద్దరు యోధులకు ఒక్కసారే తగిలి భూశయనం చేయించడం – ఈ చిత్రాలన్నీ తన శత్రువే చేసినా యెంత ఆత్రతతోను, ఆనందం, ఆవేశంతోనూ వర్ణిస్తాడు !

తరవాత మునిసిపల్ వ్యవహారాలలో తన ప్రతిస్పర్థి నిడమర్తి దుర్గయ్య గారిని అలాగే మెచ్చుగుంటాడు.

ఆ తరవాత మైలాపూరు మేధావులతో – మహా మహా

న్యాయమూర్తులతో వచ్చిన మాట పట్టింపుల దాకా ఈ గుణం కనబడుతుంది.

మెచ్చుకుని వెన్ను చరచ గలడు! నొచ్చుకుని వెన్ను చీల్చగలడు.

మరొక విశేషం. ఎక్కడా తన లోపాలకు కూడా తళుకు మలామా పూయుడు.

అల్లాడి ఆదెయ్య కొడుకు చిన్న ప్రకాశాన్ని తన్నాడు. వాడి గూబ ఇతని కందదు. కనుక ఎలాగ పగ తీర్చుకోవడం ? వాడి పుస్తకం దొంగతనం చేసి, సువర్ణముఖి ఒడ్డున ముక్కలు ముక్కలుగా చింపి పారేస్తాడు. ఇదో రకం చచ్చు పగ తీర్చుకోవడం. అయితే మాత్రం ?

నాటకాల్లో వేషాలు వేసేటప్పుడు నారీమణులతో సహవాసం తప్పదు ! ఏం జెయ్యమంటారు ?

అమాంతంగా ఒక అభూత నైతిక విప్లవం వచ్చి అహింసలో పడిపోవడం, ఆర్జవ కైలాసం అధిరోహించడం - ఇలాంటి వేవీ జరగవు.

అసలు ఇతని జీవితంలో ఉన్న బలం అంతా ఇదే. ఇతగాడు సామాన్య ప్రజ - వెలుగు చీకట్లతో !

కొందరి స్వీయ చరిత్రలు చదువుతుంటే - వాళ్లు పుట్టుకతోనే సజ్జనులై పుట్టి ఊరుకున్నారా అనిపిస్తుంది. మరి కొందరివి చదువుతుంటే ఒక్కసారి ఒక మహా ముహూర్తాన వాళ్లు ఎలాగ మంచివాళ్ళు అయిపోయారో అనిపిస్తుంది.

జవహర్ లాల్ జీవితంలో వచ్చే సంఘటనలు ఒక్క జవహర్ లాల్ జీవితంలోనే వస్తాయి.

పండితుడు మోతీలాలు ప్రభువు ఏకమాత్ర పుత్రుడు. బాల్యంలోనే భారతీయ ప్రముఖులతో సహవాసము; మాలవ్యాజీ, సర్ సప్రూ అనుదినమూ ఆనంద భవనానికి విచ్చేసే అతిథులాయె! ఇంగ్లాండులో చదువు.

ముందే తేలిపోతుంది మన కందని వాడని.

ఆయన అనుభూతులు మనకు రావు. పుట్టుకతోనే కాంగ్రెసు ప్రెసిడెంటుగా పుట్టేసి ఊరుకున్నాడనిపిస్తుంది, ప్రహ్లాదుడూ వగైరా లాగ.

జవహర్ లాల్ ప్రత్యేక వ్యక్తి, గొప్ప వ్యక్తి, అసాధారణుడు.

ప్రకాశం చేసే పనులు మనమూ చేస్తాము. అతడు అనే మాటలు మనమూ అంటాము.

కన్నతల్లి కడుపు తీపివల్ల పూటకూటి ఇల్లు పెడితే కాలక్షేపం చేసినది మొదలుకొని, ప్రధానమంత్రి పదవి అధిష్ఠించిన దాకా ఏ వాక్కూ, ఏ కార్యమూ మనకి దూరమైనదిగా కనబడదు.

ప్రజే ప్రధానమంత్రి అయింది.

కాని ఆ సాధారణతలో ప్రత్యేకత కూడా ఉంది. కనుక, ప్రకాశాన్ని ఏరి పట్టం కట్టుకుంది.

ఇక్కడ ఒక్కమాట :

ఇతని జీవితయాత్రా మార్గమంతా బాణాక్రరల ఘలఘలల తోనూ, తుపాకీ గుండ్ల తొందరలతోనూ మాత్రమే నిండి ఉంటుందని అనుకోకూడదు.

నిజమే, ఇతగాడు తుపాకీమందు వాసన కొడితే చాలు ఎదురుగా కదన రంగంలో దూకే రకమే!

కాని ఇతని బతుకులో గుండెలు కరిగించే కరుణ ఘట్టా లెన్నో ఉన్నాయి! తండ్రిగారు వెళ్లిపోయాక, తల్లిగారు వంటపూటి ఇల్లు పెట్టడమూ, నాలుగు రాళ్ళకోసము మేనమామ, బావమరుదుల ఇళ్ళ మధ్య అల్లల్లాడడమూ, నిరుపేద కుర్రవాడు లాయర్లని చూచి సరదాకు లాంగ్ కోటు కుట్టించుకుని బడాయిగా వేసుకోవడమూ, రైలులేని రోజుల్లో పన్నెండేళ్ళ పిల్లవాడు ఒంగోలు నుంచి రాజమహేంద్రవరం దాకా వెళ్ళడమూ, ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారూ, ఇల్లాలు లక్ష్మమ్మగారూ ఈ పెంపుడు బిడ్డతో ఎడబాటు సహించలేక ఏడవడమూ, తరవాత తాను బారిష్టరయ్యాక వట్టి కృతజ్ఞతా ప్రదర్శనానికి కాక కేవలమూ ప్రేమవల్ల వారి ఋణము తీర్చుకోవడమూ, తాను నెలకు ఏ డెనిమిదివేల రూపాయలు తెస్తూంటే, తల్లిగారు మరణశయ్యమీద ఏడెనిమిది వందల రూపాయలు కూడబెట్టి ఇవ్వడమూ – ఈ గాథలు చదువుతుంటే ఒక్కొక్కసారి గుండెల్లో పోటు పొడిచినట్లవుతుంది. కళ్ళు కరుగుతుంటాయి.

1921 తరువాత సాగే 'నా జీవిత యాత్ర' ఎలా ఉంటుందో! త్వర త్వరగా చదవాలని ఉంది.

ఇది ప్రజాయుగం అంటున్నారు. ఇక్కడ ప్రజా ప్రభుత్వం వచ్చిందంటున్నారు. ఈ రోజుల్లో ఎంత సామాన్యాతి

సామాన్యుడైనా తనకంటె ఎత్తుగా నిలబడినట్లుగా ఉన్నవాణ్ణి సహించలేడు.

అధికారం అసహ్యంగా ఉంటుంది. అది రక రకాలు: మెదడుకు సంబంధించినది, నైతిక వర్తనకి సంబంధించినది, అర్థమత్తతకి సంబంధించినది.

ఇలాగ జాతీయ నాయకుల్లో ఒక్కొక్క గొప్ప మేధావి ఉంటాడు. ఒక్కడు పదివేలమందిలో ప్రసంగం ఇస్తున్నపుడు తన తెలివి తేటలు చూపిస్తూ, పరమతత్వాలు విశదపరుస్తూ, లెఖ్ఖలతో, అంకెలతో, సుభాషితాలతో జనానికి ఊపిరాడనీయక తన ఔన్నత్యము తెలిసో తెలియకో చాటుతూ ఉంటాడు. మరొక్కడు అహింసా ప్రేమలూ, ఆర్జవావేశమూ తానే మూర్తి కట్టినట్లనిపిస్తూ నీతి కథలు మెత్తమెత్తని మాటల్లో పొదిగి అపర ధర్మరాజులా అయిపోయి, మనకి అందరానంత మంచివాడుగా సాక్షాత్కరిస్తాడు.

వీళ్ళు గొప్పవాళ్ళు కాదనను.

మన లోనివారని మాత్రం అనిపించరు. ఈ ప్రజాయుగంలో అసలే అనిపించరు.

వీళ్లు –

Too bright and good, for human nature's daily food !
మనలాగ ఉంటాడు, మనలాగ చేస్తాడు. మనలాగ బాధపడ్డాడు, సుఖపడ్డాడు. మనకు మించిన తెలివి తేటలున్నా మన బుర్రలకి వానిని రుద్దడు. మనకు తెలియకుండానే వాటిని మనకోసం వినియోగిస్తాడు.

అలాంటి వాడు కాకపోతే, ఇంకెవడు ఈ రోజుల్లో మన రాష్ట్రానికి ప్రధానమంత్రిగా ఉండడానికి అర్హుడు చెప్పండి!

ప్రత్యేక వ్యక్తిలాగ కాక ప్రజకు లాగే తనకు కులంలేదు, మతం లేదు, వయస్సులేదు డెబ్బైయైదేండ్ల వాడయి తాత అయిపోలేదు.

పాతస్మృతులు నెమరువేసుకోకుండా జాతితో సమానంగా పరుగెత్తుకుంటూ వచ్చేవాడు కాకపోతే ఇంకెవ్వడు మన రాష్ట్రానికి ప్రధానమంత్రిగా అర్హుడు చెప్పండి!

పాకీవాళ్ళు, పారిశ్రామికులు, కర్షకులు, కష్టజీవులు అటువంటివాడితో కాక మరెవ్వరితో తమ కష్ట సుఖాలు వెళ్ళబోసుకుంటారో చెప్పండి!

రాళ్లు విసిరేవారిలోనూ, తుపాకీ దెబ్బలు తినేవారిలోనూ మాత్రమే ఉండే స్వభావం గలవాణ్ణే నాయకుణ్ణిగా వీళ్లు స్వీకరించగలరుగాని, మరెవ్వరి సాన్నిధ్యానికి ఆప్తతతో వస్తారయ్యా?

మళ్ళీ అంటున్నాను: ఇది ప్రజా ప్రభుత్వం అయితే, ప్రకాశం లాంటి ప్రధాని మరొక్కడు ఇప్పుడు దొరకడు. ఈ దృష్టితో చూస్తే ప్రస్తుత భారతదేశంలో ఏ రాష్ట్రానికీ ఇంత అర్హుడయిన ప్రధాని లేడు!

(తరువాత చెందిన మార్పులతో)

* * *

# కోపల్లె – ముట్నూరి – భోగరాజు

[శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి 'జాతి వెలుగులు' అన్న గ్రంథానికి శాస్త్రిగారు వంతరించిన ముందుమాట నుంచి]

ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు గార్లున్నూ, చెరుకువాడ నరసింహం, కౌతా శ్రీరామశాస్త్రి గార్లున్నూ బ్రహ్మయ్యగారికి గురువులూ, అత్యంత ఆప్తులున్నూ. మరి వీరిలో ముఖ్యులు కోపల్లె, ముట్నూరి, భోగరాజు వారు; మరి వీరిలోనూ ముఖ్యులు ముట్నూరి వారు. బ్రహ్మయ్యగారికి పరమ గురువులు వీరు.

ఇక వర్తమానాంధ్రలోకానికి గురుదేవులైన రఘుపతి వేంకట రత్నం నాయుడుగారికి మొదటి తరం అంతేవాసులు వీరందరూ; వారికి ప్రియతములైన అనుచరులున్నూ. వీరి మూర్తులను (personalities) నాయుడుగారే తీర్చి తీర్చి నిర్మించారు. వీరి తరుణ మనో మందిరాల తలుపులు తెరచినవారు వారే! వానిలో

ప్రభాత మంగళ కాంతులూ, పరిమళ భరాలైన దివ్య పవనాలూ వారే ప్రసరింపజేశారు.

నేను కూడా వారి చరణ సవిధాన కూర్చున్నవాడనూ, వారికి అత్యంత సన్నిహితుడనూ, వారి శిష్యులలో దాదాపు తుదితరం వాడను.

కనుక – హనుమంతరావు, కృష్ణారావు, పట్టాభిగార్లు నాకు పెద్ద అన్నగార్లు; నా వారు. ఒకే ఒక గురుదేవ చరణాలను సేవించుకున్నవారం మేము.

ఒకే ఒక దివ్య సంసారం మాది.

మా ప్రేమలూ, మా భక్తి ప్రపత్తులూ, మా గురు శిష్య సంబంధాలూ మీలో చాలా మంది ఇప్పుడు భావించుకోనైనా లేరేమో!

కాళేశ్వరరావు గారు నన్ను ఆప్యాయంగా "తమ్ముడూ" అని పిలుచుకున్నపుడు, నే నెలాగున వివశుణ్ణి అయిపోయేవాడనో మీ కెలాగున తెలియపరచడం ?

నా అన్నలకు శిష్యుడూ, ప్రియతముడూ, సహచరుడూ అయిన బ్రహ్మయ్యగారు నాకు దగ్గర చుట్టం కారూ ? మా విశాల సంసారంలోని వారే ఆయన కూడా !

మరి నాకు లాగే బ్రహ్మయ్యగారికిన్నీ మరీ మరీ ఇష్టులు ముట్నూరి వారు. మా దృష్టిలో తెలుగునాటి సంస్కారారామంలో విరిసిన సంపుల్ల మందారం మా కృష్ణారావుగారు. నాడే

రుషివాటికలోనో "తపోభగ్నులై" నేడీ తెలుగునాట అవతరించిన తాపసులుగా వారిని బ్రహ్మయ్యగారు వర్ణిస్తారు.

ఆయనవీ, కోపల్లె, భోగరాజులవీ కథలూ, గాథలూ చెప్పి చెప్పి బ్రహ్మయ్యగారు నన్ను ఎలాగ తన అనురాగావరణంలోనికి లాగుకొన్నారో, ఆయనకు నే నెలాగ లొంగిపోయానో గాని !

ఇక మా నాయుడుగారిని గూర్చి కూడా బ్రహ్మయ్యగారన్న మాటలు వినండి. ఏ ముట్నూరివారో, భోగరాజువారో అన్నట్లు విన్పిస్తాయి అవి నాకు.

"శ్రీ నాయుడుగారు శీతకిరణుడు. పూర్ణచంద్రుని వంటివారు. ఇరవయ్యో శతాబ్దం ఉత్తరభాగంలో మనకు లభించిన స్వరాజ్యసిద్ధికి కావలసిన అన్ని హంగులూ ఏర్పరచుటకు పందొమ్మిదో శతాబ్దం ఉత్తరభాగంలో జన్మించిన కారణజన్ముడాయన. మద్రాసు నుండి శ్రీకాకుళం వరకు ఆంధ్ర మాగాణములు సేద్యము చేసి ప్రతి సంవత్సరం ముంగారు పంటలను పండించి అసంఖ్యాకు లగు విద్యావేత్తలను ప్రభవింపచేసిన పంటకాపు ఆయన. మన మహాత్ముని కనుసన్నల స్వరాజ్య సంరంభమున సేనా వాహినుల సమర రంగమున దుమికించి జయభేరీలలో ఆంధ్రపౌరుషమును, ప్రశస్తిని దిశ దిశలనూ చాటినది వారి శిష్య ప్రశిష్యులే! నాయుడుగారికి నేను ప్రశిష్యుడను."

ఈ మాటలు వ్రాసిన బ్రహ్మయ్యగారిని కృతజ్ఞతతో ఆలింగనం చేసుకొంటున్నాను. నా గురుదేవులనూ, నా జ్యేష్ఠ సోదరులనూ తలచుకొని భక్తితో శిరస్సు వంచుకుంటున్నాను....

బ్రహ్మయ్యగారితో కబుర్లు చెప్పడమూ, కాలక్షేపం చేయడమూ నాకు చాలా యిష్టం...

ఆయన సంభాషణకు, ముఖ్యంగా ప్రియతములైన పెద్దల ధోరణులనూ, వారికి సంబంధించిన సంఘటనలనూ వర్ణించేటప్పుడు ఆ చురుకుదనమూ, రంగూ, రుచీ ఎలాగు వచ్చాయి ?

అకలంకమైన మనస్సుతో అమలినమైన ఆవేశంతో చెప్పడం అలాగు ఉంచండి ! అడుగడుగునా కథా గాథా వచ్చి, రక్త మజ్జాస్థి మాంసాలతో మూర్తులను కట్టి, ప్రాణాలను పోస్తాయి. వాటి వెనుక చిత్రపటాల లాగున నాటి రోజులు ఎదుట పరచుకుంటాయి.

"ముట్నూరి వారిలో మంచి హాస్యరసం కూడా ఉంది." అని చెప్పి ఊరుకోడీయన. అలాగ ఎవరయినా అనగలరు. ఇలాగ కథ కూడా మొదలుపెట్టి సాగిస్తాడు ఈయన.

"ఒకసారి కృష్ణారావుగారూ, నేనూ మరికొందరం కూచిపూడి వద్ద ఒక గ్రామానికి వెళ్ళాం. ఆ ఊళ్ళో ఒక పెద్దల ఇంటికీ, ఒక శాస్త్రిగారి ఇంటికి వెళ్ళాం. ఆయన అప్పుడే దేవతార్చన కావించారు. అక్కడ నిలబడ్డ మా తలలమీద పూజాజలం చల్లారు. కృష్ణారావుగారి తలమీద మరి కొంతసేపు మరి కొంత దివ్యోదకం చల్లారు. తరువాత ఇవతలికి వచ్చాక, మాతో కృష్ణారావుగారన్నారూ: ఆయన నామీద తీర్థం ఎక్కువగా ఎందుకు అభిషేకించారో తెలుసునా ? నా శిరస్సు సాలగ్రామం లాగున ఉండటంవల్ల' అని. అందరమూ గొల్లు మని నవ్వాం. మా గురువుగారిది బట్టతల కదా!"

"కృష్ణారావుగారూ, చెరుకువాడవారూ, నేనూ మరో ఊరు వెళ్ళాం. అక్కడ ముసురు పట్టింది. మేం కారులో కూర్చుంటే, చెరుకువాడవారు ఒక ఆసామీని పిలుచుకురావడానికి వెళ్ళారు – తలమీద తెల్ల ముసుగేసుకొని, త్రోవలో మరో తొందరలో ఉన్న ఒక ఆబోతు నిలబడి ఉంది. వాన జల్లుల తెరలలో తిన్నగా చూపు ఆనక అది ఆయన వెంటబడింది. ఆయన తొందరగా నడిచి ఒక అరుగెక్కారు. 'మన నరసింహంగారు వెనక జన్మలో ఆవు సుమండీ' అన్నారు కృష్ణారావుగారు!"

ఇలాగ చెప్పుకు పోతూంటే ఆయన సుందరమూర్తి బ్రహ్మయ్యగారి మ్రోల నిలబడుతుంది. వివశుడౌతాడు.

తనలాగే ఆయనను అమిత భక్త్యనురాగాలతో అర్చించే కోట సుబ్బారావుగారు అప్పుడు స్ఫురణకు వస్తాడు. వెంటనే సుబ్బారావు గారి తండ్రి కొడుకుతో అన్నమాటలు చటాలున మనస్సులో మెరుస్తాయి. "ఒరేయ్ – నీవు నా కర్మ – చేయవురా కృష్ణారావు కర్మ చేస్తావు" అన్నవి.

అప్పుడు – "కృష్ణారావుగారిది గుండ్రని ముఖం, పెద్ద కాటుక కళ్ళు. కోటేరు వంటి ముక్కు, విశాల వక్షస్థలం, దీర్ఘ బాహువులు, బంగారు వంటి మై చాయ, పెదవుల మీద చిరునవ్వు, కిరీటం వంటి తెల్లని తలపాగా' అంటూ ఒక్కొక్క గీత, ఒక్కొక్క వర్ణం తగిలించుకుంటూ పోతాడీయన.

అంతలో కోపల్లె హనుమంతరావు గారు ప్రవేశిస్తారు – బ్రహ్మయ్యగారి మనోవీథిలో. ఈయన గొంతు మరీ ఉత్సాహంతో ఊగుతుంది.

కోపల్లెవారికి, మన కుటీర పరిశ్రమలలో వికసించే కళా విదగ్ధత అంటే అమిత గౌరవం అనీ, నిరుపేదలూ, శ్రమ జీవులూ అయిన సామాన్య జనం అంటే వల్లమాలిన సానుభూతి అనీ, రుషి అయిన జగదీశచంద్రబోసులాగ ఆయన చెట్టూ చేమకూ కూడా చుట్టమనీ చెప్తాడు. అలాగ చెప్పి ఆగిపోడు. కథలూ, సంఘటనలూ తోసుకు వస్తాయి ఇలాగ–

"పెద మద్దాలి తగరపు చెప్పులు బజారులో చూచేరు, హనుమంతరావు గారు. 'ఖరీ దెంత ?' అని అడిగారు ఆ చర్మ కారుని. 'రెండు రూపాయలు' అన్నాడతగాడు. 'ఇంత చక్కని పనికి ఇంత తక్కువ పుచ్చుకుంటే నీ కడుపు ఎలాగ నిండుతుంది?' అని మూడు రూపాయలు ఇచ్చారు ఆయన. తక్కువ ఇచ్చి విలువ లేని అతని కళానైపుణిని తక్కువ పరచడం కూడా ఆయనకు కిట్టదు.

"ఒకసారి బందరు చౌకులో మామిడి పళ్ళ దుకాణానికి వెళ్లా రాయన. నాజూకు పసందు పరక ఎంత?" అని అడిగారు దుకాణ దారుణ్ణి. 'ఒక్క రూపాయి' అన్నాడు. 'వాటి గౌరవాన్ని తగ్గించవద్దు, రెండు రూపాయలు తీసుకో!" అన్నారాయన.

"కళాశాలలో విద్యార్థులు దంతధావనానికి వేప పుల్లలు విరగ దీస్తున్నారు. అధ్యాపకులు వేప పువ్వును పచ్చడికోసం కోస్తున్నారు. 'చెప్పుకోడానికి నోరు లేదు కాని, అవి ఎంత బాధపడుతున్నవో' అన్నారు చెమ్మగిల్లిన కళ్ళతో హనుమంతరావుగారు."

ఈ సంఘటన వర్ణించి, "అట్టి మూర్తి నభూతో న భవిష్యతి' అని గొంతెత్తి చాటుతాడు ఈయన.

మరి ముట్నూరి, కోపల్లెలు ఉన్న చోటికి ముందుకు తోసుకురాకుండా ఉంటారా పట్టాభిగారు?

వీరిని వేరే వేరే దూర దూరంగా ఉంచడం ఎలాగ? కలిపి చెట్ట పట్టాలు వేసుకొని సాక్షాత్కరిస్తారాయెను!

అప్పుడు బ్రహ్మయ్యగా రంటా రిలాగ –

"ధౌతవస్త్రాలతో, కిరీటం వంటి తలపాగాతో, ఆకు చెప్పులతో, ప్రసన్న వదనంతో, చేతికర్ర విలాసంగా తిప్పుకుంటూ, ప్రశాంతంగా కృష్ణారావుగారు నడిచి వస్తే. అంతలో సూటుబూటులతో, జరీ అంచు తలపాగాతో, బంగారు గొలుసు గల జేబు గడియారంతో, చేయి ఎత్తితే అందని ఎత్తైన గుర్రపు బగ్గీలో పట్టాభిగారు ప్రత్యక్షమౌతారు. ఒకరు ముట్నూరి వారాయెను! ఒకరు భోగరాజువా రాయెను! వేషభాషలలో, సంభాషణలలో, నడవడిలో, ప్రకృతిలో కొట్ట వచ్చినట్లుండే దండీ వారి తారతమ్యం! – అయితే పట్టాభిగారికి కృష్ణారావుగారి సలహా సంప్రదింపులు పూర్తిగా ఉంటూ ఉండేవి. నేను ఏ దయినా పట్టాభిగారి అభిప్రాయం కోరినప్పుడు వారు తమ అభిప్రాయం చెప్పి, 'కృష్ణారావుతో కూడా సంప్రదించండి' అనేవారు. 'కృష్ణారావుగారు మీరు చెప్పిన దానికి భిన్నంగా చెప్తే, తిరిగి మీ వద్దకు రమ్మంటారా?' అని ప్రశ్నిస్తే, 'అబ్బే, ఎందుకు ? కృష్ణారావు మాటే ఫైనల్ (final)' అంటుండేవారు. 'ఒక్క అరటి పండు తినడాని కిచ్చి' 'ఒక రాట్నం

ఇచ్చి, ఇన్ని పుస్తకాలిచ్చి, ఏ పాడు వయినా కాగితాలిచ్చి' సిరాబుడ్డీ, కలం ఇస్తే నా కింకేమీ వద్దు' అనేవారు ఆయన-"

అంటూ పట్టాభిగారిని గూర్చో, వారి అవిశ్రాంత కార్యోత్సవాన్ని గూర్చో, కత్తి అంచు వంటి వారి మేధను గూర్చో, ఎన్నో భిన్న భిన్న వివరాలూ, విశేషాలూ మాలలాగ గుచ్చుకుంటూ పోతారు బ్రహ్మయ్యగారు సంభాషణలో.

అవి లేకపోతే మూర్తి చిత్రణ ఎలాగ? నడుమ నడుమ ఒక వక్రరేఖ తగలవచ్చు; అది వికటహాసం మాత్రం కాదు. ఒక నీలినీడ తోచవచ్చు, అది మసిపూత మాత్రం కాదు...

ఆ మధ్య....

నేను హైదరాబాద్ నుండి బెజవాడ వెడుతున్నాను. దారిలో నా కారుకు ఏ తిక్క పుట్టిందో హఠాత్తుగా కదలనంది...

అంతలోనే బ్రహ్మయ్యగారు తన కారులో వస్తున్నారు. వారి డ్రయివరూ, నా డ్రయివరూ కలిసి నా కారును బుజ్జగించేలోగా మేము ఒక తూముమీద కూర్చున్నాం...

బ్రహ్మయ్యగారు ఆ రోజున ... కొన్ని గాథలు చెప్పారు మా సంభాషణలో - మహాపురుషులు కొందరిని గూర్చి. వాటిని ఈ "జాతి వెలుగులు" లో కూడా ఉదాహరించినట్లున్నారు. ప్రజ్ఞా పాటవాల మీద కన్న, వినయ సంపదమీద, గౌరవ మర్యాదలిచ్చి పుచ్చుకోవడం మీద, ఈయనకు ఎక్కువ గౌరవము, ఇష్టమూ ఉన్నట్లు అనిపించింది నాకు - ఆ మాటలు వింటుంటే !

"మీరు నాకు గురుతుల్యులు" అని దేశ భక్తునితో అన్నాడట మహాత్మాజీయే!

నవభారత శిరోమాణిక్యం గదా జవహర్‌లాల్! "నాకు మోతీలాల్జీ ఎటువంటివారో మీరూ అటువంటి వారు" అని వెంకటప్పయ్యగారిని మన్నించాడట!

హిందూ ముస్లిం విభేదాల విషయమై నిష్కర్షగా గాంధీజీని ప్రతిఘటించాడు గదా పాంచాల సింహం! అయితే మాత్రం? 'ఎప్పటికయినా ఆ సమస్యను పరిష్కరించగల మహానాయకుడు ఈ నలభై కోట్లలో ఒకే ఒక్కడు - మహాత్మాజీయే!" అని ఉదారంగా ప్రకటించాడు లాలాజీ!

"నా కన్న మీరు త్యాగశీలురు; నేను నెలకు యెనభై రూపాయల భృతి తీసుకుంటున్నాను; మీ రేమీ తీసుకొనడం లేదు" అని కోపల్లె వారిని శ్రీనివాసశాస్త్రి వంటి ఉదాత్తుడే కీర్తించగలడు.

ఆ నాడు జాతీయ మహాసభా సమావేశం జరుగుతూంది. ఆ దివ్యదినాల్లో మాట! రివ్వున జవహర్ మెరుపులాగ లేచి నిలబడతాడు - నిర్భయంగా, స్వతంత్రంగా మెరసిపోయే కళ్లను పరచుకుపోయే జగత్తులోనికి పరిపిస్తూ! "పెద్దలెల్లరకు విశాల దృక్పథం లేదు; నేటి ప్రపంచ పరిస్థితుల అవగాహన లేదు" అని ఉరుముతాడు. "జవహర్‌లాల్ మమ్మల్నందర్నీ తెలివి తక్కువ వారిగా చిత్రిస్తున్నాడు; వీని కొాక కుమారుడు పుట్టి వీనిని తెలివి తక్కువ వానినిగా నిరూపించే శుభదినం కోసం నే నెదురు

చూస్తున్నాను" అంటాడు మోతీలాల్జీ! అనురాగంతో ఆవంత ఒరిగిన వాత్సల్యమూ, ఉజ్జ్వల సంకల్పంతో ఒక్కింత శిర సెత్తిన తారుణ్యమూ! సత్యనిరతీ, స్వతంత్రతా, ధీరత, గంభీరత, నమ్రత, నవ్యత, ఔన్నత్యము, అడకువ - ఆనాడు సభా గగనాన ఎట్టి వానజల్లులు కురిసేయో! ఎన్ని విద్యుల్లేఖలు మెరిసేయో!...

బ్రహ్మయ్యగారి సంభాషణలలో ఉన్న గుణాలు కొంతవరకు ఈ "జాతి వెలుగుల" లోనూ స్ఫురిస్తాయి...

ఈ "వెలుగుల" లో అందరూ సూర్యచంద్ర తారామండలాల వంటివారు. వీరిలో జవహర్ లాల్, లాల్ బహదూర్ శాస్త్రి, లాలాజీ ఈయనకు ఆరాధ్యులూ, ప్రియులూ అయినా, అంతంత దూరాన ఉంటూ కాంతులు ప్రసరించిన వారు. దేశోద్ధారక, దేశభక్తులు ఈయనకు కొంత దగ్గరగానూ, సుంత దవ్వులనూ మెరసినవారు, వయస్సూ మొదలైన కారణాలను బట్టి!

మిగిలినవారు ఆకాశ మండపంలో లాగుననే ఈయన మందిరాంతరంలో గూడా దీపాలు. తాను కూడా తన స్నేహంతో వానిని తరుచు ఎగసన ద్రోసినట్లు అనిపించేటంత సన్నిహితులు!

నాయుడుగారు ఆ వెలుగుల మధ్య అఖండ జ్యోతి.

నాయుడుగారు వీరి గురుదేవులకే గురుదేవులు; అందుకే వారి కీర్తనకు తన మాటలు చాల వన్నట్లు వాటితో ముట్నూరి వారి ఉజ్జ్వల వాక్కులు కూడా పొదిగి వినిపించారు.

ఇక , మిగిలిన అయిదుగురినీ నన్నూ ఈయనకు పూజ్య

భావమూ, అనురాగమూ, మెప్పు ఉన్నాయి. అయితే వీటిలో పాళ్ళు మారుతాయి వ్యక్తుల్ని బట్టి!

కోపల్లెవారి మీద పూజ్యభావం ఎక్కువ. ముట్నూరిపై ప్రేమ ఎక్కువ. భోగరాజుపై వల్లమాలిన మెప్పు. చెరుకువాడతో చెలిమే అనిపిస్తుంది. కౌతావారి మీద గొప్ప గౌరవం.

ఇక ఈయనకు కోపల్లె జీవితం ఒక దివ్యకీర్తన; ముట్నూరుది ఒక సుందరకావ్యం; పట్టాభిది ఒక ఉజ్జ్వల నాటకం.

హనుమంతరావును కీర్తిస్తూ ఈయన చిట్ట చివర ఇలాగ అంటాడు :

"ఆయన స్మరణీయుడైన తరువాత ఆయన ఉన్నతాదర్శాలకు అనుగుణంగా జాతీయ కళాశాల రూపు మలచి నిలుప లేక పోయినారు - వ్యవహార దక్షులూ, మేధావులూ, పండితరాజులూ, మహాకవులూ, గొప్ప శిల్పులూ అయిన ఆయన మిత్రులూ, అనుయాయులూ కలిసి కూడా. కారణం ఇదిః వారి అందరివీ ప్రతిభా పాటవాలు; వాటిని తనలో ఇముడ్చుకొని వాటిని మించిపోయిన తపస్సు ఆయనది" అని.

ఈ మాటలను బట్టి నాకు ఈ విధాన తోచిందిః కోపల్లెకు జాతీయ కళాశాల దేవళం, ఇతరులలో కొందరికి కళాయతనం, మరికొందరికి గొప్ప సంస్థ - అని !

ఇక బ్రహ్మయ్యగారు కృష్ణారావును వర్ణించే బాణీయే వేరు. అయినా, పగిడీ మొదలుకొని పాదరక్షల వరకు ఆ మనోహర విగ్రహమూ, ఆయన కొలువు కూటమూ, ఆ దర్బారులో

జ్ఞానప్రదీపితమై, భక్తిరస ప్లావితమై కర్మాచరణ ప్రబోధకమై నింగి నేలలకు నిశ్రేణి కట్టే ఆయన వాణీ, ఆ ఔన్నత్యమూ, ఆ సౌలభ్యమూ, ఆ గాంభీర్యమూ, ఆ ఉల్లాసమూ - అంటూ ఇలాగ అలవి కాని అనురాగంతో సాగిపోతాడు.

మరి పట్టాభి వద్దకు వచ్చేసరికి వేగమూ, వేడీ మిక్కుటమవుతాయి. వివరాలు ఎక్కువ అవుతాయి.

కోపల్లె, ముట్నూరులది కొంతవరకు భావలోకం. భోగరాజుది ఈ వాస్తవ జగత్తు.

కనుక పట్టాభి జీవితంలో సంఘటనలు ఎక్కువ. సంఘర్షణలూ ఎక్కువ.

దానిలో వైవిధ్యం ఎక్కువ. ఉద్యమాలూ, ప్రయోగాలూ, ప్రయత్నాలూ - వీటితో ఆయన మెదడులాగే, ఆయన మాటలాగే ఆయన జీవితం కూడా పందెపు గుర్రం లాగున పరుగెత్తుతుంది.

అది కార్యోత్సవం; తాను విశ్రాంతి కోరదు, దగ్గర చేరిన వారికి ఊపిరాడనీయదు.

ఆధునికాంధ్ర నిర్మాతలు ఇద్దరిలో, స్వభావాన్ని బట్టి చూస్తే, వేంకటరత్నానికి ముట్నూరి సన్నిహితుడు; వీరేశలింగానికి పట్టాభి దగ్గిర వాడు. అంకం పైననూ, ఆలింగనంలోనూ ఒదిగి పోగల అనుగులు వేంకటరత్నం అంతే వాసులు. ఇరుప్రక్కలనూ, వెనువెంటనూ మారు మాటాడక నడిచి పోయే కార్యశూరులు వీరేశలింగం అనుచరులు.

"అసంఖ్యాకు లగు వారి శిష్యులలో నే నొకనిగా కాక ప్రథమశ్రేణి శిష్యునిగా నా జోహారు లర్పించుకొనుచున్నాను" అని పట్టాభిగారి నర్చిస్తాడీయన.

ఇలాగ ఆ మహాపురుషుల మూర్తులను చూపిస్తూ, ఆ కాలాలను మన మ్రోల పరుస్తూ, ఒక్కసారి నేడు తనచుట్టూ మూగి ఉన్న ఆంధ్రప్రదేశాన్నీ, దానిలో యువజనాన్నీ పరికించి, తన గురుదేవుడైన కృష్ణారావు గొంతు రవ్వంత కుదుర్చుకొని ఇలాగ ప్రబోధిస్తారు, పాపం, బ్రహ్మయ్యగారుః

"మీ ఆదర్శము ఉన్నతమైనదిగా ఉండాలి. మీ అనుష్ఠానము ధర్మబద్ధమైనదిగా ఉండాలి. మీ వర్తనము విశుద్ధమైనదిగా ఉండాలి. మీకు జయము ధ్రువము, చిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు కోపల్లెవారి త్యాగశీలమూ, ముట్నూరివారి విమల వర్తనమూ, భోగరాజువారి కార్యకౌశలమూ అలవరచుకొని, దేశ సౌభాగ్యమును పెంచుదురుగాక!" .....

– 'జాతి వెలుగులు' 1966, త్రివేణీ ప్రెస్.

( స మా ప్తం )

* * *